

గతనెల 8వ తేదినాడు హోంశాఖామంత్రి శ్రీ బి. యస్. దాతర్ గారు సాయినిలయమును దర్శించినపుడు తీసిన ఛాయాచిత్రము. ఇందులో ఎడమప్రక్కనుండి వరుసగా శ్రీ H. C. మాణిక్యరెడ్డి, ఆదోని; హోంశాఖామంత్రి శ్రీ దాతర్, మాజీ మద్రాసు మంత్రి శ్రీ H. సీతారామరెడ్డి, బెళ్లారి; శ్రీ H. కేశవరెడ్డి, అర్ధగేరి; స్వామి కేశవయ్యాజీ, ఇన్‌కమ్‌టాక్సు ఉద్యోగులు శ్రీ A. భగీరథన్, సూర్యారావుగారలు కలరు.

శ్రీ బి. యస్. దాతర్ గారు షుమారు 14 సంవత్సరములుగా శ్రీ సాయిభక్తులు. స్వామి కేశవయ్యాజీగారి పట్ల వారికి గల భక్తివిశ్వాసములు విశేషము. శ్రీ దాతర్ గారిరాక సందర్భమున స్వామిగారు స్వాగతమిచ్చి, ప్రత్యేకపూజ సలిపి, విభూదిప్రసాదములను పంచిపెట్టిరి.

# ముద్దొచ్చే పిల్లలకు ముందు మంచి రోజులు

**బాలల దినోత్సవం 1957 నవంబరు 14-తేదీ**

## ఆడుకునే టప్పుడు

అమ్మ కూడా తెలివైనదే.
చేనేత గుడ్డలతో మనకి
గౌనులు, చొక్కాలు ఎన్నో
ఎంత అందమైనవి
కుట్టించిందో చూడు! ఎంత
ఉతికినా, ఎన్నాళ్లయినా
మన్నుతాయి. ఎన్ని రంగులు,
ఎన్ని రకాల నేతలు-
అన్నీ ముచ్చటయిన చేనేత
గుడ్డలే! ఆటలాడే చిన్ని
పాపాయిలకు భలే
బావుంటాయి!



# చేనేత వస్త్రాలు

ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డ్
షాహిబాగ్ భవనం, విటెట్ రోడ్, బొంబాయి.




DA-57/179 TG




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏ మాసమునుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయ మూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] నవంబరు 1957 [సంచిక ౧౧

# విషయసూచిక



పల్లెపడుచులు




జయజయ గృహలక్ష్మీ మ్ర సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# వరకట్నాల నిషేధం బిల్లు



వరకట్నాల బిల్లు ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ప్రవేశపెట్టగానే అభ్యుదయ శక్తులమనుకునే కొందరు కాంగ్రెస్ శాసనసభ్యులే వ్యతిరేకించుట శోచనీయము.

ఒక సభ్యుడు బిల్లును విమర్శిస్తూ మద్యపాన నిషేధచట్టానికి ఏగతి పట్టిందో అదే వరకట్నాల బిల్లు చట్టమయిన తరువాత దానికి పట్టగలదన్నాడు.

మరొకాయన వరకట్నాలను నిషేధించుచు చట్టము రూపొందినచో 'చీకటి బజారు' ఏర్పడుతుందన్నాడు. ఇలాంటి విమర్శలు అనేకంబయలుదేరడం సహజం.

కాని యీ వరకట్నాలు సాంఘికపరిస్థితులను చక్కబరుస్తున్నవా? లేక అధోగతి పాలుచేస్తున్నవా? అని పారజూడవలసిన బాధ్యత ప్రతియొక్క ప్రజాప్రతినిధిపైన, ప్రతియొక్క ప్రజాహితసంస్థపైన గలదు.

వరకట్నాల నిషేధంవలన ఎవరికి నష్టం? ఎవరికిలాభం?

ఒకసంపన్నుడు తనకుమార్తెకు పెండ్లిచేసి అత్తగారియింటికి పంపేముందు ఎంతైనా ఆస్తియివ్వవచ్చు; ఎంతైనా ధనమివ్వవచ్చు. దానిని నిషేధించమని ఎవరూ కోరరు. కాని చదువునో, ఆస్తినో యోగ్యతగా పరిగణిస్తూ తమ కిన్నివేలరూపాయలు వరకట్నంగా నివ్వాలని ఆడపిల్లలతండ్రుల ఉండిలేములను గుర్తించకుండా వేధించేవారిని మాత్రం అదుపులోనుంచడానికి వరకట్నాల నిషేధచట్టమత్యవసరము.

ఆడపిల్ల తెలివితేటలు గలదైనా, అందగత్తె అయినా, విద్యావతి అయినా - యిన్నీయుండి తండ్రిబీదవాడయినా ఆ పిల్లలకు వరకట్నాల మూలంగా యీడు జోడు అయిన మంచిసంబంధము దొరకదు; కాని అట్టియోగ్యతలు ఏమిలేకపోయినా ఆడపిల్ల సంపన్నుని కుమార్తె అయినచో మంచిసంబంధము దొరకడము వరకట్నాల వలనగల దుష్ఫలితాలలో నొకటి.

ఇక తమకు స్థిమితమున్నా లేకపోయినా తమ ఆడపిల్ల సుఖపడగలదనే ఆశతో తమకున్న ఆస్తిపాస్తులను అమ్ముకొని, కట్నకానుకలిచ్చి సంపన్నులతో సంబంధాలు చేసి ఆర్థికంగా చితికిపోవడమేకాక తామాసించిన ఆడపిల్ల సుఖసౌభాగ్యాలుకూడా దక్కకుండా పోవడం సయితం అనేకసందర్భాలలో చూచుచున్నాము.

ఏదో ఆస్తిపాస్తులున్నవనో, లేక బి. ఏ. లాంటి ఉన్నత విద్యయున్నదనో వినియో, కనియో ఒక సామాన్య కుటుంబీకుడు తనకున్న యావదాస్తిని కరిగి కట్నంగానిచ్చి తనకుమార్తెకు వివాహంచేస్తే పిల్లనిచ్చిన కుటుంబము దిక్కుమాలినదయో, లేక పిల్లవాడు అప్రయోజకుడు, అయోగ్యుడైతేనో పిల్లకు పుట్టినింటిలోను, అత్తగారింట్లోను పిడికెడుమెతుకులు పుట్టక అల్లాడుతున్న సందర్భాలున్నవి.

వరకట్నాల నిషేధం చట్టంగా రూపొందేముందు ప్రజాప్రతినిధులు పై విషయాలను గుర్తించి పిల్లనిచ్చేవారికి, పుచ్చుకునేవారికి మధ్య సంబంధమునకు వరకట్నము ప్రాతిపదిక కాగూడదనేది గుర్తించాలి.

పుచ్చుకునే వారి అభిరుచులకనుగుణంగా పిల్ల అందచందాలు కలిగి, విద్యా

వతియై, సద్గుణములు కలిగియుండాలి. మర్యాద, మన్ననలు యిచ్చిపుచ్చుకునేవారి కుటుంబాల గౌరవప్రతిష్ఠలకు, చరిత్రకు సంబంధించినవి కాబట్టి గణ్యతకురావాలి. తమకు లక్షలు, వేలు సిరిసంపదయుండికూడ ఆడపిల్లల యితర యోగ్యతలను అధిగమించి ఎదుటివారిస్థితిగతులను పాటించకుండా వేలుకట్నాలు కోరడంమానాలి. తామా సంబంధమును, కోరిన కట్నముయిస్తేనేగాని చేసికోడం లేదనే ధీమా తొలగాలి.

ఆడపిల్ల తండ్రి తనమోజు ననుసరించియో, ఆడపిల్ల సౌభాగ్యమునుద్దేశించియో, లేక తన అల్లుని పురోభివృద్ధికి తోడ్పడుటకనో సంతోష పూర్వకంగా ఎంతైనా, ఎప్పుడైనా యివ్వవచ్చును. దానికి, కట్నాలనిషేధ చట్టానికి సంబంధముండదు.

నిర్ణీత కట్నకానుకలులేనిదే తమ బిడ్డలకు ఆడపిల్లలను పుచ్చుకొని వివాహం చేయమని భీష్మించుకునే వారిని శిక్షార్హులుగా చేయడానికి చట్టం అవసరం. ఈ చట్టం అమలు జరుగాలంటే ప్రతి కుటుంబీకుడు తనహక్కులు, అవకాశములను అర్థము చేసికొని వ్యవహరించవలసియున్నది. ప్రజాసహకారంలేనిదే ఏ చట్టంయొక్క ఉద్దేశము ఫలప్రదంగా నెరవేరదు.

## సిగ్గుచేటు

అక్టోబరు 30-వ తేదిన నాగపూర్‌లో ముగ్గురు యువతులు సాయంకాలం ఘాట్‌రోడ్డున నడచివెళుతుండగా యిద్దరు యువకులు వారినిచూచి సైకిళ్లమీద వెంటబోయి అందులోనొకడు ప్రేమగీతాన్ని ఆలాపన ప్రారంభించాడట. ఆయువతుల్లో నొకామె చప్పున కాలిచెప్పు విడిచి దవడపళ్లురాలేటట్లు కొట్టిందట. ఆమెతోపాటు మిగతావారూ చెప్పులు తెగేటట్లు కొడ్తుంటే కోలాహలంచూడడానికి వందలకొలది ప్రజలు గుమికూడారట.

ఆధునిక యువకుల్లో చాలమందికి తమలో యోగ్యతలున్నా లేకపోయినా తమకు నచ్చినయువతినల్లా ఆకర్షించాలనే ఆరాటం మహాదొడ్డది. ఆకర్షించాలనుకున్న యువతి మనస్తత్వం ఏలాంటిది? ఒకవేళతానాకర్షించి ఆమెను ఉద్ధరించకలిగేది ఏమిటి? అనేవిషయాలను యువకులు పొరజూడరు. స్వార్థమునకు ప్రాధాన్యమిస్తూ, వెకిలితనంగా వ్యవహరించడం ఫలితంగా అమర్యాద, అప్రతిష్ఠపాలు కావడం, లేక అమాయకుల జీవితాలను నాశనముచేయడంతప్ప మరేమిలేదు. జీవితపురోభివృద్ధి నుద్దేశించు యువకులు క్రమబద్ధమైన జీవయాత్రకలవాటుపడటం అత్యవసరం.

—o—

# క ని వి పం చి

“విజయ”

ఆమె! ... ఆమె ఏకాకి! ... నావారంటూ గుప్పెటలోని యిసుక రేణువుల్లా యనేకమందియున్నా ఆమె ఏకాకి! ... స్వరాలు పలుకని విపంచి ... పరిమళంలేని పువ్వు ... ఆమెతో ఎవరూ మాట్లాడరు ... కనీసం పలుకరించనైనా పలుకరించరు. ఆమె యూహిస్తుంటుంది ... కలలు కంటుంటుంది, ఎవరైనా తనతో మాట్లాడితే; తనను యవ్యాజంగా పలుకరించితే తియ్యగా తన హృదయంలో వీణమీటినట్లుంటుంది!! ... కాని యంతలోనే నిరాశ. ఆమె వూహాలన్నీ నీటిమీది యలలు ... తనకి తానే జవాబు చెప్పుకుంటుంది. మాట్లాడితే, పలుకరిస్తే, తనేంచేయగలదు. ... వాళ్ళేం మాట్లాడి ఆనందిస్తారు మాట్లాడలేని తనతో మాట్లాడి? ... స్వరరహితమునైన తీగల్ని కదిలించినట్టే. కారణం! ఆమె మూగది ... యొక్క మాటలోతప్ప తక్కిన విధాల యామెలోని లోటు వెదకడానికి కనీసం యొక యుగంపడుతుంది. ఆమె యందం యనిర్వచనీయం, కాని అది నిరాధరమైంది. ఆమెది జాలిగుండె! ఎవరికైనా కష్టాలువస్తే యామె చూడలేదు. కాని ఆమె సానుభూతి, సహాయం నిగ్రాంచనీయాలు. తల్లిదండ్రులు ... తోడబుట్టిన చెల్లెండ్రైనా మాట్లాడరు. కనీసం యొక్కమాట, యొకేయొకమాట మాటాడరు ... అదే ఆమె చింతకు కారణం, లోలోనే కుమిలిపోతుంది. తండ్రి యామె పదుమూడేళ్ళవరకు యొక విధమైన యాదరంతో చూసేవాడు. దగ్గర కూర్చోబెట్టుకుని రామాయణం, భారతం, భాగవతం చదివి వినిపించేవాడు. వ్రాయను నేర్పినాడు ... కాని యీ యనురాగం, యాదరణ యంతా యామె పదునాల్గవయేడునుంచి ఏమయిపోయిందా! యనిపిస్తుంది. ఆమె వయస్సు హెచ్చినకొలది, అతనిలోని ప్రేమ విలువ తగ్గజొచ్చింది. ... ఆమె చెల్లెండ్రకొక గుదిబండై కూర్చుంది ... ఆమెకు పెళ్ళికానిది వారి కవదు ... ఆమె కిప్పుడు పందొమ్మిది వసంతాలు. మొదటి చెల్లెలు వాణికి పదునేడేళ్ళు రెండవ చెల్లెలు వేణికి పదునైదేండ్లు... కాని ఆమెకి పెళ్ళికాదు; వేలకువేలు కట్నం గుమ్మరిస్తే - ఏమూసిలాడితోనో, పడుచాడితోనో, మధ్యవయస్కునితోనో పెళ్ళైపోవచ్చు, కాని హరిహరరాయుని ఆస్థంతా కలిపి అమ్మినా మూడొందలు ఖరీదు చెయ్యదు. ఈ సమస్యే తండ్రినుండి యామె విముఖత్వానికి కారణం.

ఇక తల్లి సంగతి, చెల్లెండ్ర సంగతి సరేసరి. వాళ్ల సౌఖ్యస్రవంతిలో ఆమె యొక విరిగిపడిన వృక్షంలా యడ్డంకియని వాళ్ల యుద్దేశం. ... ఆమె నెవరూ పలుకరించరు. కాని ఆమె అందరికి కావాలి. ఆమె సహాయం ప్రతివారికి కావాలి ... వారందరికి ఆమె సేవలు చేయాలి. చేస్తుందికూడ! ... ఎవరేది చెప్పినా కాదనే స్వభావం, ఎదిరించే యహంభావం యామెలో వెతికినా దొరకవు. అదే ఆమెలోని యలౌకిక ప్రవృత్తి ... ప్రక్కింటి నాయుడుగారి కోడిపుంజు కమ్మని నాదముతో ఆమె మేల్కొంటుంది ... ముందుగా లేగదూడల్ని విప్పి తల్లిదగ్గర విడిచిపెడుతుంది. తర్వాత వీధిలోకివెళ్ళి వీధివాకిలి యూడుస్తుంది. కల్లాపు జల్లుతుంది. పెరడంతా యూడుస్తుంది ... బావి దగ్గరి రెండు తొట్లనిండా నీళ్లు చేదుతుంది ... అక్కడ పడేసిన యంట్లపాత్రలన్నీతోమి, వంటింట్లో సర్దుతుంది ... అప్పటికి అందరూ నిద్రనుండిలేస్తారు. అందరికి తోముపుల్లలు, నీళ్లు యందించి, ఆవుల దగ్గర పాలు పితుకుతుంది. తర్వాత స్నానపానాలలో చెల్లెండ్రకీ, తండ్రికీ, తల్లికి తోడ్పడుతుంది. అక్కడితో రెండు తొట్ల నీళ్లు కాళీయైపోతాయి. విడిచిన బట్టలు

కుప్పగా తయారవుతాయి. వాటి నన్నిటిని యతికి యారవేసి, మళ్ళా రెండు తొట్లనిండా నీళ్లు చేదుతుంది. అప్పటికి ఆమె మొదటి కార్యక్రమం ముగుస్తుంది. వంటింటి దగ్గరకు వెళ్ళి గుమ్మంమీద తల్లి పెట్టిన ఫలహారము, అది యొకొక్కప్పుడు యందరకూ పెట్టగా మిగులుతేనే ఆమెకు ముడుతుంది లేక పోయిననాడు లేదు. వట్టి కాఫీ తీసుకుంటుంది ... ఫలహారమున్ననాడు దానిని తీసుకుని పశువులశాల లోనికి వెళుతుంది. ఆమె వస్తూందనగా అవి మెడలో గంటలు గలగలలాడేటట్లుగా తలలూచి ఆమెకు స్వాగతాలు పల్కుతవి. ఆమె చేతిలోని ఫలహారాన్ని కొంచెం కొంచెంగా వాటికి పెడుతూ తను తింటూంటుంది ... ఆ పని ముగియగానే బిందె తీసుకుని చెరువుకి బయలుదేరుతుంది. అక్కడ ఆమెను చూచి అమ్మలక్కలు వేళాకోళాలు, వెడనవ్వులూ పరిహాసాలు ప్రారంభమవుతాయి. ఆ యపస్వరాలు యామె కాళీబిందెకు తగిలి యామె హృదయంలో బాధగా ప్రతిధ్వనించేవి. ఆమె వారినేమీ యనలేదు ... అనదుకూడ ! ... జాలిగా అందరివైపు యొకేయొక చూపు చూసేది - దాంతో మళ్ళీ నవ్వులు పువ్వులులా రాలేవి. ఆమె మారు మాటాడకుండా నీళ్ళు యెత్తుకుని యింటికివచ్చేది. దారిలో శివాలయపు పూజారి ఆమె నప్యాయంగా పలుకరించి, ప్రేమగా శిరసునిమిరి, రెండరటిపళ్లు యిచ్చేవాడు. ఆమెయంటే, ఆ మాత్రమైనా ఆదరము చూపేది అతనే. ఆప్యాయతతో గతబాధలన్ని యామె మరచిపోయేది. యింటికివెళ్ళి బిందెనుదించి పెరటిలోనికేగేది. తాదెచ్చిన అరటిపళ్లు ఆ పశువులకు పెడుతూ యనిర్వచనీయానందాన్ని యనుభవించేది... ఆమెకు తల్లి, దండ్రి, మిత్రుడు, తోడు, నీడ యన్నీ యవే ... వాటి సాన్నిధ్యంలో, వాటి పరిచర్యంలో ఆమె హృదయం ఆనంద డోలికలనూగేది...అమె హృదయం నిర్మలమైనది, నిశ్చలమైనది. ఆ హృదయాలయంలో యా పశువుల స్వరాలు గుడిగంటల స్వరాలుగా రవళించి, యాలయమంతా సంతోషంతో మారుమ్రోగేది ... అలాగే మధ్యాహ్నం అందరి భోజనాలు యయ్యేవరకూ గడిపేది...అందరూ తిన్న తర్వాత వంటింట్లో తన నిమిత్తం పాత్రలోయుంచిన భోజనాన్ని తెచ్చుకుని తిని హాయిగా యక్కడే పడుకునేది తీయతీయని కలలుకంటూ. మధ్యాహ్నం మూడుగంటలవుతుంది. లేచి యింట్లోని అంట్లన్నీ తెచ్చితోమి నీళ్ళుతోడి, చెరువుకెళ్ళి నీళ్లుతెచ్చి యక్కడికాపని పూర్తిచేస్తుంది ... ఆమె కెవరూ అలంకారం చెయ్యరు. అలంకారానికి ఆమెకు ఏమీయుండవు. ఉన్నా, అనవసరమనిపిస్తుంది,

చక్కగా తలదువ్వుకునేది, యుతికినచీర కట్టుకునేది. పశువులని తీసుకుని నదియొడ్డుకి బయలుదేరేది ... తప్పటడుగులువేస్తూ ముందుకీ వెనక్కీ చూస్తూ నడిచే ఆ పశువుల సందడి ' ఆమె హృదయంలో మహా సంరంభంగా యుండేది. అవి ఏదో మాట్లాడుతున్నట్లు, ఏదో చెప్పుతున్నట్లు, వెనక్కి తిరిగి ఆమె ముఖంలోకిచూసి యుత్సాహంగా ముందుకు సాగిపోయేవి ... కాలవవార చెట్లదగ్గర నాలుగుకొమ్మలుకోసి వాటి ముందుపడేసి గట్టు మీద యొకచోట కూర్చునేది. అవి ఆ ఆకులుతింటూ, పరిసరాలలో షికారుచేస్తూ మిత్రురాలికి కాస్త విశ్రాంతి నిచ్చేవి ... ఆమె యలా యా నదియొడ్డున కూర్చుండి కదిలే అలలని, మెదిలే చిరుచేపలనీ చూస్తుండేది. ఆమె దగ్గరకి ఎవరూ వెళ్ళేవారు కారు. చిన్న పిల్లలు సరదాగా ఆమె ముఖంలోని కళను చూచి దగ్గరకిరాగా, తలిదండ్రులు బెదిరించి రానియ్యకుండా జాగ్రత్తపడతారు. ఆమెకదే మనసులో బెంగగా నుండేది. తన దగ్గరకి పసిపిల్లల్ని గూడ యెందుకు రానియ్యరు? తనేం చేస్తుందని? ... నిశ్చలంగా చిరుకెరటాలతో ప్రతిఫలించే తన రూపాన్ని చూసుకుని ఆమెలోని కోర్కెలు రేకెత్తినట్లై ఒక గులకరాయి తీసుకుని ఆ రూపంమీదికి విసిరేది. అటుయిటు నీటిలో కదిలే తన రూపాన్ని, చెదిరే సుడులనీ ఆసక్తితో ఆనందంతో చూసేది. ఆ ఆనంద సమయంలో గోపాలు దక్కడికి వచ్చేవాడు. అతని పశువులు ఆమె పశువులతో కలిసిపోయేవి. ఆనందాన్ని తాను కొంత పంచుకునేవాడు

... వాడొక అభాగ్యుడు. కన్ను తెరవకముందే తల్లినీ, కన్ను తెరచి తండ్రినీ కోల్పోయాడు. జీవితంలో నా యనే దిక్కు లేక, అల్లరి బిల్లరగా తిరిగే రోజులలో దూరపుబంధు వొకామె చేరదీసి దగ్గర యుంచుకుంది. వాడితోగూడ ఎవరూ మాట్లాడరు, ఎవరూ స్నేహం చేయరు ... కారణం ... కులం, గిలం, జాతి, నీతి, డబ్బు, గౌరవం లేనివాడు ... ఆమెకు మాటలురావు ... వాడికి మాటలువచ్చు. ఊరి బడిపంతులు చదువుతప్ప మరే సంస్కారమూ వాడికిలేదు. కష్టసుఖాలలో ఆమె సలహాలను తప్పకుండా పాటించేవాడు. తావిన్నవి, కన్నవి అన్ని సంగతులు రోజూ యామెతో చెప్పేవాడు. ఆమె ఆనందంతో ఆలకిస్తూ, కళ్లతో సందేహాలు, యను మానాలు అడిగేది. మరీ పెద్దవియైతే ఇసుకలో వ్రాసి యడిగేది. ఆమె వింటుంటే, ఆమెను చూస్తుంటే వాడి కదొకలాటి ఆనందం. ఆమె దరి యుంటేనే వాడికి స్వర్గంలో యుండినట్లువుంది. ఆ మాటే చాలమార్లు ఆమె దగ్గర యనేవాడు. ఆమె నవ్వేది యంతే ... లోకం వారి ననుమానించదు. అనుమానించలేదుకూడ! కారణం, ఆమె పందొమ్మిదేళ్ల నవయువతి. వాడు పద్నాలుగేళ్ల బాలుడు. ఆమెయంటే వాడికి, వాడంటె ఆమెకి, యనిర్వచనీయమైన మమత ... అలౌకికమైన ప్రేమ; అవ్యాజానురాగం...చీకటిపడేవేళవరకూ ఏవేవో కబుర్లు చెప్పుకునేవారు. ఆమెలేచి నిల్చునేది. "వా! వా! వా!" ఆ పశువులు ఎక్కడయున్నా పరుగెత్తుకుంటూ ఆమె దగ్గరకివచ్చి యాప్యాయంగా యామె కాళ్లను చుట్టుకొనేవి. అతడు తన పశువులని తీసుకొని కొండవాలుగా వెళ్ళిపోయేవాడు. ఆమె వాటిని తోలుకుని యిల్లుచేరేది. ఆమె దినచర్య మామూలే. రాత్రి పెరటిలో జామచెట్టుక్రింద మంచంవేసుకుని పండుకునేది. నిద్రబోయేదికాదు. మెరిసే చుక్కల్ని వెలిగే చంద్రుణ్ణి కదిలే ఆకుల్ని మెదిలే పుష్పాలనిచూస్తూ ఏదో ఆలోచించుకునేది. చెట్టుమీదికి అప్పుడప్పుడు యొక రామచిలుక వస్తూండేది. వచ్చినప్పుడల్లా అది కడుపునిండాతిని, రెండు జామకాయలు ఆమె మంచంమీదరాల్చి యీ విధంగా యొక యభిమానాన్ని చూపేది. ఆమెలేచి యల్లా సంతోషంతో ఆ జామపండ్లనేరి తినేది. "ఓ చిలుకా! ఓ పలుకా! నీకు పలుకువచ్చు. చక్కగా మాట్లాడతావు. కాని నాతో ఎందుకు మాట్లాడవు. నేనంటే నీ కిష్టంలేదా, ఇష్టంలేకపోతే జామకాయలెందుకు పడేస్తున్నావు. నీ కెక్కువైపోయా! ... కాదు, కాదు నేనంటే నీకు ప్రేమే! నిజంగా ప్రేమే ... చిలకా నువ్వు అందమైనదానివి, నా కంటేనా, కావు కావు. కాని నీకు రెక్కలున్నాయి, వాటితో నీవు స్వేచ్ఛగా తిరుగుతున్నావు, నా కవిలేవు. అందుకనే నేను యిలా దుఃఖితురాలనైయున్నాను. ప్రకృతి యెంత సుందరమైనది; ఎంత నిశ్శబ్దంలో, ఎంత నిశ్చలమైన ప్రవృత్తి. ప్రకృతీ! నీలో యందముంది, నాలో యందముంది. కాని నీ అందానికుండే సంచలనమూ, నీ ఆనందానికియుండే ప్రతిచలనము నా అందానికి, ఆనందానికిలేవు. మల్లెల సొగసుద్వారా, కలువనవ్వుద్వారా, రోజా సౌరభంద్వారా, వెన్నెల మార్దవంద్వారా, సంధ్య యను రాగంద్వారా నీ అందాన్ని నీ ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నావు. కాని నేనెలా చేయగలను. నా అందం నా ఆనందం యిలా నాలోనే యిమిడి నశించవలసిందేనా! ... నిస్వరం విస్మృతం. నిశిథం యగోచరం. ఇంతే ... యివి ఆమె హృదయం పలికే మాటలు. ఇదియు ప్రకృతికితప్ప మరెవ్వరికీ యర్థంకానిభాష...అలా ఆలోచిస్తూ ఏ తెల్లవారుజామునో నిద్రబోయేది ... ఆమె జీవితానికి విశ్రాంతి లేదు, అది నిజం!

♦ ♦ ♦

ఒక నాడు తండ్రి దగ్గరకు పిలిచాడు. ఎందుకు పిలిచాడో ఆమెకర్థంకాలేదు. చెల్లెంద్ర ముఖంలో యదొకలాటి కళద్యోతకమవుతూంది. తల్లి కళ్లలోని వెలుగు నక్షత్రాల్ని మించింది. ఏమీతోచక తండ్రి దగ్గరకు వెళ్లింది. ప్రేమతో దగ్గరకు తీసుకుని తల నిమిరి ఏదో చీటీ యిచ్చాడు. ఆమె చదువుకుంది.

ఆమె ముఖమొక్కసారి వివర్ణమైంది. హృదయంలో ఏదో బాధా చిహ్నమైనముసలముకదిలింది. తండ్రి కాళ్ళమీద బడి ఏడ్చింది. ఏదో వ్రాసియిచ్చింది. దాని చదువుకుని యతడు మండిపడ్డాడు. చీదరించుకున్నాడు. ఆమె దుఃఖిస్తూ పశువుల పాక దగ్గరకి వెళ్ళిపోయింది. ఆమె దుఃఖానర్థము చేసుకున్నట్లుగా యవి రోజూలా ఆమెని పలుకరించలేదు. ఆమెయొక రాటకు చేరబడి వెనక్కి చేతులు పెనవైచి ఆకాశంవంకచూస్తూ నిలుచుంది. నీరెండ ఆమె కపోలాలమీదపడి జారుతున్న కన్నీటి బిందువులు ముత్యాలలా మెరుస్తున్నాయి. పశువులుకూడ తలలు వంచుకుని, మారు స్వరం లేకుండా ఏదోఆలోచిస్తున్నట్టుగా యప్పుడప్పుడు యామెవంకచూస్తున్నై. ఆమె యొక్కమారు తల త్రిప్పి వాటికేసిచూసింది. అవికూడ మోరలుపైకెత్తి ఆమెకేసిచూసాయి. కలుసుకున్నచూపుల్లోంచి భాష్పాలు రాలినై. ఒక్కసారి పెల్లుబికిన హృద్వేగంతో వాటిదగ్గరకువెళ్లి మెడలని కావలించుకుని, తలలని తన చెంపలకుచేర్చి ఏడ్చేసింది. ఆమెబాధనర్థంచేసుకున్న అవి కూడ ఏడుస్తున్నట్టు "ఛా!" యన్నవి ... అవును. ఆమె దుఃఖాన్నెవరర్థంచేసుకుంటారు? చేసుకోగలరు? ... తండ్రి ఆమెకి సంబంధంచూసాడు. వరుడు చదువుకున్నవాడు. విశాలభావాలు కలవాడు, బాగాడబ్బున్నవాడు ... మొదటి పెండ్లివాడేకాని అతనికి శుభ మూగదని తెలీదు ... ఆ సాయంకాలమే వధువుని చూసుకోవడానికి వస్తాడట "ఈ కపటం ఎంతవరకు దాగుతుందో, తుదకు ఎలా పరిణమిస్తుందో ఆమెకు తెలియనిదికాదు. అందుకే తండ్రితో "తనకిపెళ్ళివద్దనీ, తననిలా ఏకాంతంగా యుండనీయమని, తన మూలంగా ఎవరికీ ఎలాటి చిక్కులు తేవద్దనీ" వ్రాసింది. ఎన్నాళ్ళనుండో వెదుకుతున్న తన శ్రమ యీనాడు తీరబోతుంది ... జరిగే మార్పు ఆయనకీ తెలుసు. కాని ఏదోఏమైనా, శుభకిపెళ్ళంటూయైపోతేచాలు ... ...ఆ సాయంకాలం వరుడు సతీశుడువచ్చాడు ... ఎప్పుడూలేని ప్రేమ యీనాడు కనబరచింది తల్లి. సంతోషంగా చెల్లెండ్రు ముస్తాబుచేశారు ... సతీశుడామెను చూస్తూనే కళ్లుచెదరి యదిరిపడ్డాడు. అలాటి యందాన్ని అతనింతవరకు కలకత్తా, హుగ్లీనగరాలలో చూడలేకపోయాడు. నేడిక్కడచూస్తున్నాడు. వినీలాకాశంలో చిన్నమబ్బు తెరలా ఆమెముఖంలో యలుముకున్న దుఃఖితమేఘాన్ని చూచి అతను జాలిచెందాడు. వివాహమై దూరమగుటచే దుఃఖిస్తుందని, యంతేగాని యీమెకులోటేమిటనీ తలపోసాడు ... ఆరోజే తన మిత్రుడికి జాబువ్రాస్తూ యిలా వ్రాసాడు. "నేను యీరోజూనే హరిపురంలో వధువుని చూసాను. ఆమె అందాన్ని నేను వర్ణించలేను. కాని అలాటి రూపం యీలోకంలో దుర్లభమని చెప్పగలను —"

ఆ సాయంకాలము ఆమెను చూస్తూనే గోపి యీమె దుఃఖాన్ని పసిగట్టేశాడు. అతనంతకుముందే ఆసంగతి కర్ణాకర్ణిగ వినియున్నాడు. ఆమె నిశ్శబ్దమై కూర్చుంది. అతను మెల్లగా కదిలించి సంగతంతా చెప్పియడిగాడు. ఆమె యౌనని తలూపింది. "శుభా! నన్నువిడిచి వెళ్లిపోతావా! నన్ను మర్చిపోతావా!" యని యన్నాడు యీమె విషణ్ణవదనంచూసి ఆమె ముఖం శరత్కాలమేఘావృతమైంది. ఆమె మాట్లాడలేదు. "శుభా! నాకు తెలుస్. నువ్వునన్ను మర్చిపోవు. కాని నన్ను విడిచిపోతున్నావు ... నాకు యిక నీలాటినేస్తాలు ... ఎలాటినేస్తాలు దొరకరు. నేనొంటరివాడనైపోతాను. నీతో మాట్లాడుతుంటే నీ సన్నిధానంలో నాకు స్వర్గంలో తేలినట్టుంటుంది. శుభా... యీకాల్వలోని చేపలు, ఈ నదిలోని అలలు, యీచెట్ల ఆకులు, ఆకుల మధ్య పువ్వులు... అన్నీ దుఃఖిస్తాయి, నువ్వు వెళ్ళిపోతే, శుభా ... రాత్రి నాకొక కలవచ్చింది. నువ్వు ఎందుచేతనో వచ్చిరావడంతోనే యీనదిలోకి దూకావట నీ వెంటనేనూ దూకాను. నువ్వు చేరగానే యీ కొలనంతా స్వర్ణమయమైంది; రత్నాల వెలుగులతో, కెంపుల మిలమిలలతో, ముత్యాల కళకళలతో అక్కడొక మహామండపంలో కప్పలు, చేపలు, పాములు జలగలు సొరలు అన్నీ కొలువుతీర్చి నిన్నుకొలుస్తు

న్నాయి. నువ్వొక నవరత్నాల సింహాసనంమీద కూర్చుని దేవతలా వెలిగిపోతున్నావు. ఆ సమయంలో నేనెంతో ఆశతోనే నీ దగ్గరికి వచ్చాను... కాని నేనుయడుగుపెట్టీ పెట్టగనే అదంతామాయమైంది. స్వర్ణమయ సరోవరమంతా ఎక్కడమాయమైందో ఏమో, ఈదురుకప్పల బెకబెకలతో, చిరుచేపల కకవికలతో మళ్లీ యీనది కనుపట్టింది. నేను లేచి ఆలోచించాను. సుభా నువ్వొక శాంతి దేవతవు. బంగారుకన్నెవు. కరుణామయివు. నీ సముఖంలో, నీ ముఖంలో, నీచేతలో నీమాపులో ... వెలుగు, చీకటిని పారద్రోలే వెలుగు" అతని మాటలతో, అంత దుఃఖంలోనూ ఆమె పక్కున నవ్వింది. ఆమె నవ్వులోని యాంతర్యమాయభాగ్యున కర్థమవలేదు. ఆమె యిసుకలో యిలా వ్రాసింది.

"ఓ, అభాగ్యుడా! ఎందుకలా తీయనికలల తోను, యూహలతోనూ మురిసిపోతుంటావు. యూహకీ, చేతకీ భేదం యనంతం. యూహలోని మధురానుభూతి చేతలోయుండదు ... నేనికనీకు కనబడను. నేను వెళ్లిపోతున్నాను. యీరాత్రికే మేము కలకత్తానగరం వెళ్లిపోతున్నాము ... నీతోటిచెలిమి యీ పరిసరాల మమతలోని మాధుర్యాన్ని నా మిత్రులయనురాగంలోని అనుభవాన్నివిడిచి వెలుగులోంచి చీకటికి వెళ్లిపోతున్నాను. నన్నుమర్చిపోకు. యీ అక్క నిత్యమూనిన్నుస్మరిస్తుందనే నమ్ము—" ఆ దౌర్భాగ్యుడది పూర్తిగ చదవలేక పోయాడు. కళ్ళలోని యశ్రుజవనికలు ఆ చూపులనికప్పివేసాయి. ఆమె చేతులలో తలయుంచి వలవల యేడ్చాడు. ఆ యిసుకలోని యీ వ్రాతలని చెరపి తను మళ్లీ వ్రాసాడు.

"ప్రియతమమైన అక్కా! అగాధమైన నీ మనసులోని, నీ మాపులోని, నిగూఢమైన, ఆ ప్రగాఢ ప్రేమను ఎవరు గుర్తిస్తారు? ఎవరు గుర్తించారు? గుర్తించిన నన్ను విడిచి వెళ్ళిపోతున్నావు. తెగిన బంధంలో యనుబంధపు మనోబంధం, రాగబంధమయి నవోదయమవాలనే నేను వాంఛిస్తున్నాను."

ఆ మాటలామె హృదయఫలకంపై చెరగని శిలాక్షరాలుగ లిఖితమైనాయి.

♦ ♦ ♦

కలకత్తా నగరంలో మూడు రోజుల యధిక ప్రయాసలతో సుభ పెళ్ళయిందనిపించాడు హరిహరరాయ. సుభ మూగయని తెలియకుండా యుంచేందుకు హరిహరరాయ, కీర్తిప్రియ పడినపాట్లు సర్వేశ్వరుడుగూడ యెరుగడు. ఎవరూ ఆమె నడుగలేదు. ఆమె నేమనీ యడుగకుండా, చందమామను ధిక్కరించే ఆమె ముఖంలోని వెలుగు వారిని మంత్రముగ్ధుల్ని చేసేసింది. మాట్లాడబోయి పలుకలేకపోగా, సిగ్గు, బిడియమేమోయనుకున్నారు. పెళ్ళయిపోయింది. సుభకి చెప్పవలసినదిచెప్పి, తలిదండ్రులు హరిపురం వెళ్ళిపోయారు. వరుని తరఫువారంతా వధువుని తీసుకుని దిఘడాగ్రామం వెళ్ళిపోయారు. ఆమెలోన దాచలేకపోయింది. ఆమె నిష్కల్మష హృదయం పతిని మోసగించడానికి సుముఖత్వం చూపలేకపోయింది. ఆ నాటిరాత్రి తన చరిత్రంతా వ్రాసి పతి పాదాలచెంతబడి క్షమాభిక్ష వేడుకున్నది. అతనది చదివి నిర్ఘాంతపోయాడు. కట్టుకున్న మేడలు కూలిపోగా, శిథిలాలనిచూసే దౌర్భాగ్యునిలా యామె వంక చూసాడు. ఆ నాడు ఆమె ముఖంలోని దుఃఖజీర యిప్పుడతనికి కన్ను నలిపింది. పట్టరానికోపంతో ఆమెని దూషించాడు. ... ఈ సంగతి తని తల్లికి, మేనత్తకీ తెలిసింది. వాళ్ళ దూషణాలకీ, తిరస్కారాలకి సుభ గురియైంది. ఎంతమంది ఎంత తిట్టినా, తుదకు కొట్టినా, దూషించినా ఆమె జవాబు ఆ చూపు...అదే! ఆ జాలిచూపు, ఆ చూపు నెవరూ యర్థంచేసుకోలేరు. చేసుకునేశక్తి వీళ్లకులేదు ... అదేయుంటే వాళ్లీ యంతస్తు దాటిపోతారు ... భర్త సేవచేస్తుంది. అత్త, పిన్నిగార్లకు సేవలు చేస్తుంది ... కాని పుట్టింటిలోలాగ యిక్కడా ఎవరూ మాట్లాడకపోగా రోజూ వందమార్లు తిడు

(609.వ పేజి చూడుడు)

# జోలపాట

"శోభశ్రీ"



"నిదురపో
నిదురపో
నా చిట్టి తండ్రీ!
నిదురపో,
ఏడువకు, ఏడువకు,
నిదురపో.
మురిపాలుగొలిపే ... ... "

లక్ష్మి తన సంవత్సరం వయస్సుగల చిన్నికొడుకు బాబుని బుజాన పడుకోబెట్టుకొని, ఒక చేతితో నూలు యంత్రాన్ని త్రిప్పుతూ జోలపాట పాడుతోంది.

ఆ చిన్నారి చిట్టిబాబు ఎప్పటికైనా నిద్రపోతాడా ?

"నిదురపో,
నిదురపో
నా చిట్టితండ్రీ
నిదురపో ... ... "

ఆ రోజు బాబు శరీరం సలసలా కాగిపోతోంది. బాబుని బుజంమీద పడుకోపెట్టుకున్నప్పుడు ఆ వేడి ఈమె శరీరానికి గూడ సోకుతోంది. జ్వరంతో బాధపడుతున్నాడు బాబు. ఆ రోజంతా కన్ను మూయలేదు. ఏడుపు మూలుగులతోటే కాలం అంతా గడిపాడు.

ఆ యంత్రం 'భక్ భక్' అని మ్రోత చేస్తున్నది. తోలుపటకా అదొక విధమైన మ్రోత నందిస్తోంది – భోల్టులు 'కిర్ కిర్'మనే శబ్దం చేస్తున్నాయి. అంతదాకా ఎందుకు! భూమంతా గజగజా వణికి పోతున్నదన్నట్లనిపిస్తున్నది ఆ శబ్దానికి.

యంత్రాన్ని గిరగిరా త్రిప్పుతోంది బలాన్నంతా కూడగట్టుకొని రెక్కలు పిండై పోతున్నా లెక్కచేయకుండా పొట్టకోసం - జానెడు పొట్టకోసం. బాబు - తన సర్వస్వం, జ్వరంతో మూలుగుతూ బుజంమీదపడివున్నా – రాట్నాన్ని త్రిప్పుతునే వున్నది.

"నిదురపో
నిదురపో .... .... "

తిరిగి బాబును జోగొట్టింది.

ఆ నూలు ఫ్యాక్టరీలో అందరి కూలీలతోబాటు ఆమె ఒకతె. దూదితోగూడిన దుమ్ము లక్ష్మి ముఖాన్నంతా కప్పి వేసింది – ఆమె ముఖమేగాదు, ఆ ఫ్యాక్టరీగోడలు,

యంత్రాలు, నేల గూడ. ఆమె కళ్ళతో కొద్దిగా కష్టంమీద ముఖాన్ని ముక్కుమీదుగా చూచుకుంది. ముఖమంతా తెల్లటి దూదితో వికృతంగావుంది.

"ఊఁ, ఊఁ ... " అంటూ మూలిగాడు బాబు. అంత మ్రోతలోగూడ బాబు మూలుగు ఆమె హృదయాన్ని అందుకోగలిగింది.

"నిదురపో
నిదురపో
రత్నాల తండ్రీ,
నిదురపో,
ఏడువకు, ఏడువకు
నిదురపో ... ... "

తన పాత పాటనే తిరిగి మొదలుపెట్టింది. బాబు తలను తన ముఖంవద్దకు జేర్చుకొని కన్నీటితోనే ముద్దుపెట్టుకుంది. ... తిరిగి యంత్రపు నడకలో లీనమైపోయింది.

ఫ్యాక్టరీలో పని త్వర త్వరగా సాగేందుకుగాను, ఎవరో ఒక స్త్రీ పాట ఎత్తుకుంది హుషారుగా ... ...

"గిరగిరా
గరగరా
తిరుగుతూ
పరుగెత్తె
రాట్నమా,
ఓహో రాట్నమా ... "

లక్ష్మి, కన్నీటిచారలు కట్టినకళ్లు యంత్ర పరికరాలనన్నిటిని పరిశీలించి పాటపాడిన ఆమెవైపు తిరిగినయి.

తిరిగి మామూలుమ్రోత ఆ ఆవరణను ఆవరించింది.

ఆమె హృదయం ఆ మ్రోతకు మొరటుబారింది. ఆ శబ్ద వాతావరణంలోనే ఆమె హృదయంలో నిశ్శబ్ద మావరించి, పూర్వస్మృతుల నొక్కొక్కటిని తొలియసాగింది.

పన్నెండు నెలలక్రితం బాబు జన్మించాడు - చిన్నిపొట్టతో సన్నని గొంతుకతో, పాలుగారే బుగ్గలతో ... అవును! తన ప్రేమమూర్తి ... ఇప్పుడేం చేస్తున్నారో ... ఆ రోజు తనను తీసుకొచ్చేనాడు ... నీవేనా సర్వస్వం అన్న 'ఆయన' ఏంచేస్తున్నారో ... నిజమే! తను చాలా దూరంనుండి, తల్లిదండ్రుల నొదులుకొని, తీయని మాటలు చెప్పిన పాపిష్టి ముఖాని కాశించి పారిపోయివచ్చింది.

ఆ నల్లనికళ్ళు, విశాలమైన నుదురు, నొక్కుల నొక్కులజుట్టు - తనకిశోర్, తన భర్త, తన అందాలరాశి, ఆశాసౌధం, తన సర్వస్వం ... కాని ... కాని తన ఆశలు

మొదలు నరికిన చెట్టులా కూలిపోయాయి, గాలిమేడలులాగా ఎగిరిపోయాయి.

బాబు కళ్లుగూడ ఆయన కళ్లులాగానే వుంటయి ... అసలు బాబే ఆయన .... కాని ఆయనను తెలియకుండానే వెళ్ళి పోయాడు-తానొక తండ్రి అవ్వబోతున్నాడని. మెరుపులతోవచ్చి తనకు వెలుగు చూపి, తనను లోయలోకి త్రోసివేస్తూ ఉరుములతో వెళ్ళిపోయాడు.

మొదట్లో అతడెక్కడికి పోయాడోనని ఆశ్చర్య పోయింది. క్రిందటి ఎండా కాలంలో తనవద్దే వున్నాడు, తీయని మాటలు చెబుతూ. అతనికోసం నిరీక్షిస్తూ ఆకాశంలోకి ఆశతో చూచేది ... కాని ఆశూన్యప్రదేశంలో ఈమెకి కనబడేది శూన్యం ... బాబు ఆమె బుజాలమీద తప్ప! అప్పటినుండి ఆమె కార్చేకన్నీరుకు ఆమె బుగ్గలమీద దారులు ఏర్పడ్డాయి.

"నేను ముసలిదాన్ని అయిపోతున్నాను ......" ఆమె ముఖాన్ని చేతితో తడిమి చూచుకొని అప్పుడప్పుడు అనుకుంటుండేది.

"ఊఁ ఊఁ ..." తిరిగి బాబు మూలిగాడు.

వెంటనే ఆమె హృదయంలోబ్రాహ్యాపు మోత కూడింది.

"బాప్ రే బాప్ ! ఏమిటీఈ గొడవ ...పిల్లవాడిని ఒక్క నిముషంగూడ ఏడ్వకుండా ఉంచలేవు" అని ప్రక్కనున్నకూలీ విసుక్కుంది.

తిరిగి కిశోర్ జ్ఞాపకమొచ్చాడు లక్ష్మికి. కిశోర్‌నిచూచి చాలా రోజులయింది ... అదంతా ఒక కలగా జరిగిపోయింది ... ఇప్పుడేంచేస్తున్నాడో ... ? స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ ఏస్త్రీ జీవితాన్ని నాశనంచేస్తున్నాడో ? ...

బాబుని క్రిందపడుకోబెట్టి ముఖంలోకి చూచింది....నిశ్శబ్దంగాపడుకున్నాడు నోరు మూసుకొని ... అది మంచి సమయం... తను ఇంకా త్వరగా యంత్రాన్ని తిప్ప గలదు.

"నిదురపో
నిదురపో
నా వరాలమూట..."

పాతపాటను గొణిగింది .... తిరిగి జీవం లేని చిరునవ్వుతో బాబుని బుజానవేసు కొని, .. కదలకుండా నిలిచిన కళ్ళను, కొయ్యబారిన చేతులనుచూచి నివ్వెర పోయింది.

లక్ష్మి ఆతృతతో యంత్రాన్ని నిలిపి వేసింది.

బాబు వంక నిర్వికారంగా చూస్తూ నిలబడింది.

బాబు చనిపోయాడు!!
విద్యుత్ ప్రహారం తగిలిన దానివలె

తూలిపోయింది. గుండెలు బాదుకుంటూ, ముఖం రక్కుకుంటు విలవిలా ఏడ్వసాగింది.

"అరె...ఏమిటి గొడవ...ఇందాకటి నుండి పిల్లవాడి ఏడుపు...ఇప్పుడు ఈమె." తిరిగి విసుక్కుంది పక్కావిడ.

"నాబాబు! నాబాబు ..." కర్కశ హృదయాలుకరిగేలా, రాతికొండలు పగిలేలా వెక్కి వెక్కి ఏడ్చింది ...

ఆడకూలీలంతా అర్థంగాక ఆమెచుట్టు జేరారు.

"ఏమిటి?" అడిగింది మేస్త్రీకూలి. అసలు సంగతి తెలుసుకొని ఆఫీసువైపుకు నడిచింది, లక్ష్మిని, బండ బారిని బాబుని బయటకు నెట్టించేందుకు!

తిరిగి ఫ్యాక్టరీ ఆవరణ యంత్రాల గోలతోనిండిపోయింది.

(ఆధారం: ముల్కరాజ్ ఆనంద్)

---

# వైద్యచికిత్సకు విద్యుచ్ఛక్తి

ఈ మధ్య ఏరోయినోథెరపీ అనే కొత్తచికిత్సాపద్ధతి వైద్యశాస్త్రంలో విస్తృతంగా వాడుకలోకి వస్తోంది. అనేక వ్యాధుల చికిత్సలో మానవశరీరంపై అయోన్స్ అనబడే అతిసూక్ష్మమైన వాతావరణపు విద్యుత్ కణాల ప్రభావాన్ని బరిశీలించిన ఫలితంగా కనుగొనబడిందా పద్ధతి. అయోన్స్, ధాతువులలో జరిగే మోలిక్యులర్ ప్రక్రియలను మార్చగలవు. అందువల్ల ధాతువు (టిస్యూ) యొక్క మెటబాలిజం బాగా మారిపోగలదు. ఇందువల్ల హైపర్‌టెన్షన్, ఆస్తమా, ఓజెనా (జలుబువంటివ్యాధి) తదితర తీవ్రవ్యాధుల చికిత్సలో అయోన్స్‌ను ప్రయోగించడానికి వీలవుతుంది. ఏరోఅయోన్స్‌ను కేంద్రీకరించగల ఏరో అయొనైజర్ అనేయంత్రం దీనికి అవసరం. అలాంటి సరియైన యంత్రంలేకపోవడం వల్ల యీ పద్ధతి విస్తృతంగా వాడుకలోకి రాలేకపోయింది. అటువంటి యంత్రాలు ఎంతో ఖరీదైనవిగా వుండేవి. వాటిని తయారు చేయడానికి అరుదుగా లభించేపదార్థాలు అవసరమయ్యేది.

అయితే కాకసస్‌లోని బాల్నియొలాజికల్ సంస్థకు చెందిన ఎ. నికొలెంకో అనే ఒక మెకానిక్కు, ప్రొఫెసర్ ఎ. పి. స్లెజిన్ అనేవారు, కొంతమంది రోగులకు ఒకేసారి చికిత్సచేయగల ఒక ఏరో అయొనైజర్ యంత్రాన్ని తయారుచేశారు. దీనిని సులభంగా మామూలు కార్ఖానాలో తయారు చేయవచ్చును. ఇది చవకకూడాను. దీనితో చికిత్స చాల గుణమిచ్చినట్లు ధృవపడింది. 30 సార్లు చికిత్స పొందేక చాల మంది రోగులకు తలనొప్పులు, గుండెనొప్పులు పోయాయి; వారికి సరిగ్గా ఆకలి వెయ్యడం నిద్రరావడం జరిగింది; పనిచేయగలశక్తి బాగా ఎక్కువైంది.

'టాస్'

---

# మోసపోయిందెవరు?

"ప్రమద"

"స్వర్ణా" అని కూరలసంచి అక్కడపడేసి పిలిచాను. లోపలినుండి జవాబులేదు. మళ్ళీ పిలిచాను.

"వస్తున్నానండి. ఎందుకట్లా కేకలేసుకుంటారు?" అంది లోపలినుండివస్తూ.

"అది సరే! మిమ్మల్ని "స్వర్ణ" అని పిలవద్దని ఎన్నిసార్లు చెప్పాను." అంది జడ్జిలాగ.

"నేను లెక్కపెట్టలేదు."

"సరే. ఈ సారినుండి నన్ను 'లతా' అని పిలవండి" అంది.

"నే పిలవను. ఎందుకు పిలవాలి?" అన్నాను.

"కాదండి! మీ చేత 'లతా' అని పిలిపించుకోవాలని నాకు మనసుగా ఉంది." అంది దగ్గరకు వచ్చి కైసర్దుతూ.

"అబ్బే! నిన్ను స్వర్ణా అని పిలవాలని నాకెంత కాలమునుండి ఉందో నీకు తెలుసా?" అన్నాను.

స్వర్ణకి బుగ్గలు ఎరుపెక్కాయి.

"నా కదంతా తెలీదు. నన్ను 'లతా' అని పిలవండి. అలా పిలుస్తారా సరే. లేదా ఇవ్వాళే మా ఇంటికి వెళతాను."

"నిక్షేపంగా పో"

"అయితే పోతాను. ఇక్కడ ఒక్క క్షణం కూడ ఉండను." కోపంకొద్దీ ఏంచెయ్యలేక ఇంట్లోకి వెళ్ళిపోయింది విసురుగా.

ఇది మా ఇంట్లో ప్రతిరోజు సాధారణంగ జరుగుతునే ఉంది. ప్రతిసారి స్వర్ణతను పుట్టింటికి పోతానని బెదిరించటముతప్ప పోలేదు. ఈ సారి అలాగే అనుకున్నాను. కాని కథ అడ్డము తిరిగింది. స్వర్ణ పెట్టె తీసికొని వెళ్ళిపోయింది.

ఈ గొడవ మా పెళ్ళికాకమునుపే ఉంది. స్వర్ణ నాకు మరదలవుతుంది. చిన్నప్పటినుంచి స్వర్ణకు 'లతా' అని నాచేత పిలిపించుకోవాల్లని ఉండేది. నేనెప్పుడు "స్వర్ణా" అనే పిలిచేవాడిని. స్వర్ణకి కోపమువచ్చేది. "పెళ్ళికాని చెప్తా" అన్నట్టు నావంక సీరియస్‌గా చూసేది. అదిచూసి నేను, మా బావమరది నవ్వుకునేవాళ్ళము.

స్వర్ణ వెళ్ళిపోయేటప్పటికి నాకేమితోచలేదు. పైగ ఆ రోజు ఆదివారమయింది. సరదాగ వంట స్వయంగ చేద్దామనుకున్నాను. నా అవస్థ భగవంతుడికెరుక!

చేతులు కోసుకున్నాయి; కాలేయి. కూరలో ఉప్పులేదు. ఎట్లాగో నేను కాబట్టి సరిపెట్టుకుని అన్నముతిని పేపరు చదువుతు వాకిట్లో కూర్చున్నాను. తలుపులేసి కాసేపటికి నిద్రపోయాను.

నిద్రలేచేసరికి నాలుగయింది; స్నానముచేసి డ్రెస్‌చేసికుని కాఫీకి బయలుదేరాను. కాఫీత్రాగి బయటకొస్తుంటే భాస్కరం కనపడ్డాడు. "రారా! కాసేపు చస్ ఆడుకుందాము" అని తీసికెళ్ళాడు మా ఇంటికి.

ఇల్లు తాళము తియ్యటముచూసి "చెల్లాయి లేదేరా!" అన్నాడు. నవ్వుతూ విషయమంతా చెప్పేను. వాడు కాసేపు ఆలోచించి, "ఉండ్రా! చెల్లాయిని ఇక్కడకు వచ్చేట్టు చేస్తాను. నీవేమి

గాభరాపడక!" అని నా చెవిలో ఒక ఉపాయము చెప్పాడు.

ఆ రాత్రి భోజనానికి భాస్కరం వాళ్ళింటికే రమ్మన్నాడు. నేను "సరే"నని వాళ్ళింటికి వెళ్ళాను.

మరునాడు నా చేత వారమురోజులు శలవు పెట్టించాడు ఆఫీసుకి. వాడు వారమురోజులు శలవు పెట్టాడు. నా చేతికి కట్లుకట్టాడు. తలకికూడ కట్లు కట్టాడు. నన్ను ఒక రోగిలాగ చేశాడు.

అనుకున్నట్టుగానే మరునాడు స్వర్ణ వచ్చేసింది తండ్రితో. రాగానే, ఆదుర్దాగ, "ఏమండి ఎలా ఉంది? ఏం జరిగింది?" అంది.

"ఎలా ఉంటే నీకేమి? నా ఆరోగ్యమే నీకు కావలసివస్తే నన్నొదలిపోతావా?" అన్నాను విరక్తిగ.

"క్షమించండి. అప్పుడేదో ఆవేశంలో చేశాను. ఇంకెప్పుడు ఇలా చెయ్యను. నా వైపు చూడండి." అంది జాలిగ బ్రతిమాలుతూ.

కాని నేనావైపు చూడలేదు. ఇంకా ఇటువైపుకి తిరిగాను.

"అట్లా అనకు నాయనా! ఏదో పొరపాటున తప్పుచేస్తే ఇదేనా నువ్వు దానికి విధించేశిక్ష. దాన్ని క్షమించు" అన్నాడు మా మామయ్య.

"నీకు తెలీదు ఊరుకో మామయ్య. దాన్ని నా ఇంట్లోంచి వెళ్ళమను—నాకు కామేశ్వరరావుగారిపిల్లని నీయటానికి నిశ్చయించారు."

"ఎవరు. మా చెల్లెలేనా?"

"ఊఁ! నేను ఒప్పుకున్నాను." అన్నాను.

"ఏమండి, రెండో పెళ్ళి చేసికుంటారా?" అంది స్వర్ణ ఆశ్చర్యంగ.

"అవును," అన్నాను.

"ఏమండీ! మీకిది న్యాయమా? ననువదలి మరో పెళ్ళి చేసికుంటారా?" అంది స్వర్ణ జాలిగ.

"అవునని ఎన్నిసార్లు చెప్పాలి" అన్నాను.

ఇంతలో కామేశ్వరరావుగారి అమ్మాయి సుజాత వచ్చింది.

"ఎవరు నాయనా ఈమె." మామయ్యకి ఇది నిజమేనేమో అని భయమేసింది.

"కామేశ్వరరావుగారి కూతురు" భాస్కరం సమాధానం చెప్పేడు.

"ఆ!" అంటూనే మామయ్య క్రిందపడి పోయాడు.

నేను రోగిగా ఉన్నాననే మరిచిపోయి ఆయన దగ్గిరకి పరుగెత్తాను. ఆయన్ని మంచముమీద పడుకోబెట్టాము.

"ఆయనకేమయింది?" అంది సుజాత, జ్ఞాపకమువచ్చి గబగబ పక్కమీదకువెళ్ళి పడుకున్న నాకు దుప్పటి కప్పుతూ

భాస్కరం చెప్పాడు.

"మీకెలా ఉందండి. ఏమయింది?" అంది సుజాత.

"ఏముంది. చెల్లెమ్మ వెళ్ళగానె వీడికి తల తిరిగిందిట. మేడమీదనుంచి దిగుతున్నాడు. మెట్ల మీదనుంచి జారిపడిపోయాడు. అప్పుడు సుజాత నాన్నగారు ఏదో పనిమీద ఇక్కడకొచ్చి, వీడ్ని పక్కమీదకుచేర్చి, సంగతి తెలుసుకుని, కూతుర్ని ఇస్తానన్నాట్ట. వీడొప్పుకున్నాడు."

"అబద్దాలాడినా నమ్మేట్లు ఉండాలి" అన్నారు కామేశ్వరరావుగారు లోపలికివస్తూ.

"మా గుండెలు లటలట కొట్టుకున్నయి."

"సంగతంతా నాకు తెలిసింది. స్వర్ణని రప్పించటానికి మీ రాడిన నాటకము మీ మామయ్యకి తెలుసు. అయినా మిమ్మల్ని ఏడిపించటానికి అట్లా పడిపోయినాడు" అని, "లేరా, ఇంకెంతసేపు పడుకుంటావు" అన్నాడు.

అప్పుడు తెలిసింది వాళ్ళిద్దరు స్నేహితులనీ మమ్మల్ని ఏడిపిద్దామనుకున్నారని. నోరు మూసుకుని ఊరుకున్నాము.

ఆ మరునాడు పొద్దునే ఆఫీసుకెడుతూ!

"వెళుతున్నా లతా" అన్నాను ఈ సారి.

"కాదు స్వర్ణా అనండి" అంది స్వర్ణ వంటింట్లో అస్పష్టంగ.

---

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౩౧

అఖిలభూత హృదబ్జమందు వెలుగడివాఁడు
యుజ్జ్వల నాముఁడై యొప్పువాఁడు
ముల్లోకవాసుల - కెల్ల నభీష్టమా
ముద్దునామముతోడ ముఱియువాఁడు
అమల, నారాయణా-ష్టాక్షరమంత్ర స్వ
రూపుఁడై జగములఁ బ్రోచువాఁడు
నాదచంద్రా మృతా మోదాభిషేకంబు
జెంది నిర్మలుఁడయి చెలఁగువాఁడు
ఆత్మలందుఁ జిన్మాత్రుఁడై యలరువాఁడు
కోటి భాస్కర తేజుఁడై కొమరుమీఱు
ముద్దుతారక రాముండు ; ముదముతోడ
నతనిఁ బ్రార్థించి సేవింతు ననుదినంబు.

౩౨

ఖశ్యాముఁడై నావు - ఖరరిపుండై నావు
ఖగవాహనుండయి గ్రాలినావు
ఖాతీతుఁడై నావు . ఖావాచ్యుఁడై నావు
ఖగకేతనుండయి గ్రాలినావు
ఖర్వారు పర్వతాగ్రమునందు నివసించి
ఖారాధ్యుఁడై నీవు గ్రాలినావు,
ఖాద్యాది భూతాత్మకంబయినావు ; శ్రీ
తారక రాముడైఁడనరినావు
శ్రీ మనః పీఠమందు వసించినావు
వరదుఁడై, ఖగమంత్ర తత్పరులఁబ్రోచి
నావు ; కోటివిద్యుత్కాంతితో వెలసితి
వమల తారకరామ ! నిన్నాశ్రయింతు.

౩౩

వేదార్థచతురుఁడై వెలసిన బ్రహ్మకు
జనకుఁడై వెలసిన - సత్యచరిత !
వేదాంతరూపుఁడై - వేద్యుఁడై వెలసిన
శశ్వత్ప్రకాశుఁడౌ చారుశీల !
వేదశృంగంబుల వితతిని జోలెడి
శేషుని ఫణులపై చిత్రరూప !
శయనించి, వేదనిర్ణయమైన - ఋక్మంత్ర
పూజిత చరణముల్ బొందినావు
జ్ఞానులకు వేద్యుఁడవు నీవు। మానివినుత!
వేదమహిమ కాధారమై। వెలయుదీవు !
తారకుండైన శ్రీరామ ! ధర్మహృదయ !
భజన సల్పెద, రక్షింపు పరమపురుష !

౩౪

లావణ్యమైన 'మూలాధార' చక్రంపు
జ్వాలలచే, సహస్రార చక్ర

మండలి, శశిబింబ। మండంబుగాఁజుట్ట
బడియున్నదామధ్య పంకజాతుఁ
డైన-శ్రీరఘురామ! హాయిగానున్నావు;
దేవతల్ వానరుల్ దివిరికొలువ
అమృతాభిషేక ప్రి-యా! నరేశులు నిన్ను
సేవించుచున్నారు చిత్తశుద్ధి
ముత్యములచేత శోభిల్లు ముద్దుశిఖలు
గలుగు మౌనులు నీ పూజ సలుపుచుంద్రు;
రమ్యగుణధామ శ్రీరామ సౌమ్యనామ!
భజన సల్పెద రక్షింపు పరమపురుష

నక్షత్రరాశిపై - నటియిదించు, ధ్రువమండ
లమునఁ బద్మమునందు రాజితముగ
శోభించు శ్రీరామ! శుభకరనామ! తా
రకరామ! రఘుపతీ! రామభద్ర!
'తత్త్వమసీ' మంత్ర - తత్త్వంబు, భక్తుల
కుపదేశ మొసగెడు నిపుణచరిత?
డంబుగాగ, ముత్యాల పీఠంబునందు
మధ్యముననుండి, విద్యుత్ సమానమైన
దేహకాంతి శోభిల్లు, వైదేహినాథ!
రామతారకనామ! నా ప్రణుతిగొనుము.

3౫

నక్షత్రములవంటి - నవ్యవిమాన, మ
ధ్యమునందు నున్నావు తత్త్వవేత్త!
ప్రకృతి, ఈశ్వరుఁడు, జీవన్మూర్తి-ఈతత్త్వ!
ములఁ బూజలందెడు ముద్దుమూర్తి
యోగనిర్గుణులయి - యెప్పెడి సిద్ధుల
పూజలఁ గొందువో పుణ్యమూర్తి!
ముక్కంటి సఖుఁడయి - భూమధ్యభాగంబు
నందున్నయట్టి - యానందమూర్తి!
వరమణి కిరీటకుండల భాసమానుఁ
డగుచు, సీతాసమేతుఁడై - హాయిగాగ
నిత్య సంతోషవార్ధిలో నెగడుచుండు
రామతారకమూర్తిఁ బ్రార్థనమొనర్తు.

3౬

కస్తూరి, కుంకుమ, కర్పూర గంధముల్
మైపూఁత గాఁగల మధురమూర్తి
కాకుత్స్థవంశ ప్రఖ్యాతుఁడై, నీలమే
ఘశ్యాముఁడై, యొప్పు కమమూర్తి
పీతాంబరముగట్టి - సీతామహాలక్ష్మి
సేవింపగావెల్గు! సిద్ధమూర్తి
ముక్కంటి కిష్టుఁడై - ముద్దుమన్మథుమించు
సుందరుఁడైనట్టి సుగుణమూర్తి
ముద్దుమంగళమూర్తి, సమ్మోహమూర్తి
శాస్త్ర విశ్వాసముఁ గొల్వుబారుమూర్తి
రామమూర్తిని ధ్యానింతు రక్తితోడ
నా మనోదుఃఖములబాపి సేమమొసఁగ.

3౭

ముల్లోకవాసులు - ముగ్ధులైనారు; బ్ర
హ్మజ్ఞాన మహిమచే హరి! ముకుంద!

3౮

నా తండ్రి, నానిధి - నా పుణ్యరూపుండు
నా తపస్సిద్ధియు! నాదు గురువు

నా ప్రాణమాయువు, నా ధ్యానరూపుండు
నా పరమాత్మయు, నా సమస్త
కర్మల పుణ్యంబు, కారుణ్యవార్ధి, నా
బహు బంధురూపుండు! ప్రాణములకు
నాధారభూతుండునై యనుగ్రహము, నా
యందుఁజూపెడి, పరమాత్ముఁడరయ
నాదుయేలిక, నా సౌఖ్యమాదరమునఁ
గోరు సన్మిత్రుఁడాతండు, కువలయేశుఁ
డతఁడు తారకరాముండు; సతతమూ నతని
సేవ సలిపెద, నా తపస్సిద్ధికొఱకు.

౩౯

సర్వస్వరూపుఁడై - సత్యుఁడై, నిత్యుఁడై
నిర్మలుండయి సదా నెగడుచుండు
సూక్ష్మరూపుండయి-శుద్ధుఁడై, యుప
మాన
రహితుఁడై, జ్ఞానియై గ్రాలునెవఁడు?
పద్మాత్ముఁడై, పుణ్యపాప శూన్యుండయి
శ్యామ దేహుండయి - యలరు నెవఁడు?
'నీవు - నేనను' భేద - నియతిలేనట్టిదై
బహు గుణంబులతోడ వరలునెవఁడు?
అతఁడు తారకరాముండు - సతమతనిని
మదిని స్మరియించి సేవించు మనుజులకును
పాప పుంజంబు దొలఁగి కైవల్యమబ్బు;
మనస! శ్రీరాము స్మరియింపు మనుదినంబు

౪౦

శ్రీ వత్సమునుగల్గి, శ్రేష్ఠమహిమకెల్ల
నాధారభూతుఁడై, యఖిలజగము
మోహింపఁజేసియు, ముదమున, శంఖ-చ
క్ర, గదాబ్జములబూని, జ్ఞానదీపుఁ
డగుచు, శ్రీ రఘువంశమను, మహావార్ధికి
సోముఁడై, విమలకౌస్తుభముదాల్చి
పీతాంబరముగట్టి, సీతాసతీమనో
నాధుఁడై, శ్రీరామ! నవ్యశోభ
నలరుదీవు! పరమహంస రూపుఁడగుచుఁ
బురుషరత్నమగుచుఁ బొలిచెదీవు!
నీలమణులరుచుల నెగడు దేహముగల్గు
రామ! నిన్నుఁదలఁతు రక్షకొఱకు

—o—

# భూదానం

(సర్వోదయ బుర్రకథ)

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

సర్వోదయం !

సర్వోదయం ! సర్వోదయం ! ||తందాన తాన||
సర్వోదయమే సర్వ మానవుల
సౌభాగ్య ప్రదము ||తందా||
సర్వ మానవు లొకటే యన్న
సమ భావము వలయు ||తందాన తాన-
మాని ! వినోబాజీ ! వందనాలు ||
బక్క చిక్కిన రైతు లోకమును
బాగును పరచండీ ||తందా||
కడుపు కాల్చుకొని కష్టపడే మన.
కర్షకుల గనండీ ||
మట్టిని మట్టై మెలగే రైతుల
మదిలో దలచండీ ||
పొలమున చెమ్మట పోసే రైతుల
పోకడ తెలియండీ ||
బండ చాకిరీ చేయు కార్మికుని
బ్రతుకు తెలియరండీ ||
కార్మిక కర్షక శ్రమ ఫలమే మన
కడుపు నింపునండీ ||

వచనం : పేదల దుస్థితిని తెలిసి కొని,

గాంధి మహాత్ముని ప్రియ శిష్యుండు
ఘనుడు వినోబాజీ ||తందా||
గాంధిజీ యంతటి మహానుభావుడు
ఘనుడు వినోబాజీ ||
పేదల సమస్య తీర్ప నెంచె నీ
ప్రేమ మానసుండు ||
ధనవంతుల నర్థించి భూములను
ధనహీనుల కొసగ ||
భూదాన యజ్ఞమును సలుపు చుండె నీ
పుణ్య పూరుషుండు ||తందా||
లభియించె నేటికి నలుబది పైగా
లక్షల యొకరములు ||

వినోబాజీ విధము తెలిసి, మీ
వితరణ చూపండీ ||
వెల లేని సంపదల దుల దూగెడు మీ
విలువను చూపండీ ||
తోడి మానవుల గోడు నెరిగి చే
దోడు చూపరండీ ||తందా||
భూస్వాములు నిరు పేదల కొరకై
భూ దానము సలుపండీ ||
ధనవంతులు నిరుపేదల కొరకై
దానము సలుపరండి ||
వచ్చేటప్పుడు పొయ్యేటప్పుడు
పుచ్చు కోక రాదు ||
శాశ్వతముగ సత్కీర్తి యొక్కటే
విశ్వములో నిలుచు ||
చిత్తానుసారము సలుపండీ మీ
ఉత్తమ దానములు ||
సత్ఫలము గాంచు మీ ఉత్తమ — దానంబు తందా||
నిష్ఫలము గాదు నిరు పేదల గాపాడు |
పాత్రోచితముగ పంచి పెట్ట బడును |
కూడూ గుడ్డా
కొంద్రకు కొదువై
కొంపకు కొదువై |
గోడును చెందే
తోడి మానవుల |
గాపాడగ జేయును |
తోడ్పడండీ !
తోడ్పడండీ !

ధర్మ దాతలార !
కారుణ్య హృదయులారా !
సాధించండీ
సాధించండీ
సర్వోదయం ! సర్వోదయం !
సర్వోదయం !




శ్రీ మండ రామరావు

ఆంధ్రులా సంస్కృతీ
సత్సంప్రదాయాలు
ధారుణీ విరజిమ్మి
దివ్యవై భవములే
అనుభవించీ నీవె
సామ్రాజ్య పాలనము
సాగించి నావమ్మ
మా తెలుగు తల్లీ! —

పచపచ్చనీ వన
రాజములు కొండలు
జల జలా ప్రవహించు
నదులు సెలయేళ్ళతో
అమరనందనముగా
అతి మనోహరముగా
అమరితివి విమలమై
మా తెలుగు తల్లీ! —

కవులలో దిట్టలూ
కవి సామ్రాట్టులూ
నన్న యా తిక్కనలు
పెద్దనా పోతనలు
జన్మించి నీ కీర్తి
జగతి చాటించారు
గాథమ్ము చేసారు
మా తెలుగు తల్లీ! —

కార్యవాది కందుకూరి
గురజాడ అమరకవి
త్యాగమూర్తి శ్రీరాములు
తాండ్రపాపయ బాలచంద్రులు
మాంచాలా రుద్రమాంబా
ఆంధ్రవీరుల కీర్తి కాముల
కన్న మాతవు నీవేనమ్మా
వన్నెలొలికే తెల్గుతల్లీ —

గోదావరి తుంగభద్ర
నాగావళి వంశధార
శారదా కృష్ణ పెన్న
పారే ఆనదుల నీరు
పొలముల్లో పారించి
మా భూమిపండించి
మమ్మేలు తున్నావు
మా తెలుగు తల్లీ! —

వీరులగు శూరులగు
ఆంధ్రుల ముక్కోటికి
సత్యాహింసలతోడి
శాంతి మందిరమును
సాధింపను దీవించుము
మానమస్కృతులివే
అందుకొనుము మా తల్లీ
మా తెలుగు తల్లీ! —

—X—

# గ్రామాభ్యుదయ కారకులు

శ్రీ గాడేపల్లి శంకరం

గ్రామాభ్యుదయానికి ప్రధమంగా సహకరించవలసినది ప్రకృతి. ప్రకృతి ప్రసాదించేవి.–సూర్యుడు–సూర్యుని వల్ల - వేడి వెల్తురు కలుగుతున్నాయి వర్షాలుకురుస్తున్నాయి. నదులు - పర్వతాలు - అడవులు - భూమి - భూమిలోవున్న ఖనిజసంపద ప్రకృతి ప్రసాదించినవే. మనము మెదడు ఉపయోగించి - ఒకరికొకరు సహకరించుకొని - పెట్టుబడులు పెట్టి– కష్టపడిపనిచేస్తే-కరువు కాటకాలుండవు–అన్నోదకాలకిలోటుండదు - ఆదాయం పెరుగుతుంది. ఆరోగ్యంగాకూడా వుంటాము. భగవంతుని దూషించి ప్రయోజనం లేదు - జనాభా పెరిగిపోతోందని విచారించీలాభంలేదు. భగవంతుడిచ్చిన సహజసంపదను పరిశ్రమచేసి సద్వినియోగపరచుకోవడము తెలుసుకోవాలి. మానవుడికి కావలసిన వస్తుసముదాయాన్ని ప్రకృతి యిస్తూనేవుంది. దానిని దుర్వినియోగం చేస్తూండటంవల్ల దరిద్రం ఏర్పడింది - అందఱూ కష్టపడి పని చేస్తే ఈ దరిద్రంవుండదు.

ప్రభుత్వం - ప్రజాస్వామ్యసూత్రాలద్వారా పరిపాలన సాగిస్తుంది - సమానప్రతిపత్తిగల సాంఘిక వ్యవస్థను సృష్టిస్తుంది - సగవకాశములు అందఱికీ అందుబాటులో వుంచుతుంది - పరిశోధనలు జరుపుతుంది - పథకాలు వేస్తుంది - ప్రచారంచేస్తుంది - అధునాతనపద్ధతులను - ఆధునిక విషయాలను ప్రజలకు తెలియజేస్తుంది - ప్రజలలో ఆసక్తిని కలుగచేయటానికి ప్రయత్నిస్తుంది - అంతే - కాని తానే పనిచేయదు-పెట్టుబడి పెట్టదు - ప్రభుత్వంప్రజలది–ప్రజలకోసమే ప్రభుత్వం–ప్రజలే ప్రభువులు - ప్రజలే స్వశక్తిమీద ఆధారపడి స్వతంత్రముగా సమస్తము చేసుకోవాలి, నాగళ్లుఎలావుండాలో - ఎటువంటివి వుండాలోతక్కువశ్రమతోఎక్కువభూమిని దున్నటం ఎట్లాసాధ్యమో - తక్కువ వ్యయంతోఎక్కువలాభం పొందటం ఎట్లాగో - (మొదలైన విషయాలు) పరిశోధనలు జరిపి తెలుపుతూవుంటుంది - కొత్తరకముల విత్తనాలను పశుసంపదను - ఎరువులను - ఏతాములను - కనిపెట్టి - వాడమంటుంది – వ్యాధినిరోధకమార్గాలనీ, చికిత్సా విధానాలనీకూడా తెలియజేస్తుంది – అంతే కాని దున్నడం - పండించడం - పండించిన సరుకును డబ్బుచేసుకోవడం - పశుసంపదను కాపాడుకోవడం - పరపతి సంఘాలు - పంచాయితీలు స్థాపించుకొని పరిపాలనను సాగించుకోవడం ప్రజలదే. దీనికి అనువైనవాతావరణమును మాత్రం ప్రభుత్వం సృష్టిస్తుంది – సలహాయిస్తుంది – అంతే. కృషికుడు కష్టించిపనిచేయాలి. కార్మికుడు చెమటోడ్చి సంపాదించాలి. మెదడును ఉపయోగించాలి. మంచి విషయాలు తెలుసుకోవాలి. నూతన పద్ధతులు నేర్చుకోవాలి. తనతోడివారితో సహకరించాలి. సహకార సంస్థలోను – సాంఘిక సేవాసంఘములోను సభ్యుడుకావాలి. తన డబ్బు బాంకులో దాచుకోవాలి – పొదుపుగా వాడుకోవాలి – అనవసరపు ఖర్చులకీ – అర్థంలేని ఆచార వ్యవహారాలకీ స్వస్తిచెప్పాలి – ఆధునికపరికరాలతో ఉత్పత్తిని ఎక్కువచేయాలి. పంచాయితీని పబ్లిక్ సంస్థలనీ గౌరవించాలి. విరామకాలంలో విశ్రాంతి తీసుకోవాలి. వినోదంగా కాలక్షేపం చెయ్యాలి. వింతలు విశేషాలు తెలుసుకుంటూ లోకజ్ఞానం సంపాదించాలి.

ఇల్లాండ్రు చేయవలసినపని ఇంతా అంతా కాదు. బోలెడంతవుంది. గ్రామాభ్యుదయానికి ఇల్లాలు ఎంత కారకురాలో చెప్పటానికి ఒక్క మాటచాలు — "ఇల్లుచూసి ఇల్లాలిని చూడమన్నారు" ఈ సామెతలో ఎంతైనా అర్థంవుంది. ఇల్లు ఎట్లావుంటే — ఇల్లాలు అట్లావుంటుంది — ఇల్లాలేకాదు — ఇల్లాలికి వున్నా పిల్లలుకూడా — ఇంటికీ ఇల్లాలికీ తగినట్టుగా వుంటారు—ఇళ్లూ ఇల్లాళ్లూ పిల్లలు—ఎల్లావున్నారో— ఆ పల్లెకూడా అల్లాగే వుంటుంది. మన నాగరికతకు పట్టుకొమ్మ స్త్రీ — చైతన్యమనేది స్త్రీలలో కలిగితేనే — ఏనిర్మాణాత్మకమైన కృషికైనా వీలుంటుంది. విజ్ఞానవిలసితమైన స్త్రీలు ఏ ఇంటనుంటారో— ఆ ఇల్లు, ఆహ్లాదముగాను — ఆరోగ్యముగాను అభివృద్ధిలోను వుంటుంది — ఇది అతిశయోక్తికాదు.

**భూమి:**—భూసారం తగ్గుతోందనీ — దున్నకునే భూమి చిన్న ఖండికలుగా చీలిపోయి — భారీయెత్తున వ్యవసాయానికి యోగ్యంగాలేదనీ అంటున్నారు — చిన్న ఖండికలను కొన్నిటినిచేర్చి — ఏకఖండముగాచేసి దున్నకునే "సహకార పద్ధతిని" అవలంబించితే మంచిది — భూసారం తగ్గిపోకుండా ఎరువులు — ఏటేటా వేస్తూవుండాలి — పెంట తోలుతూ వుండాలి — (పేడను పిడకలుచేసి తగులబెట్టడం మానెయ్యాలి.) బెల్లువిరుస్తూ వుండాలి. భూసారం తగ్గిపోతే — భోజనానికే కష్టమవుతుంది కనుక జాగ్రత్తగా వుంచుకోవాలి.

**పశువులు:**—పంట తరువాత చెప్పేది పాడి—'పాడి వుంటే పంట కాస్తుందంటారు'—పాడిపంటలు కావిడికుండలవంటివి. ఒక ఏడు కర్మంజాలక ఎండినా — పాలు పెరుగూతోనైనా కాలక్షేపంచెయ్యవచ్చు— భూమి ఎంత ముఖ్యమో పశుసంపదను రక్షించుకోవడముకూడా అంత ముఖ్యమే. పశుసంపదవల్ల — పాలు, పెరుగే కాకుండా — పొలానికి బలాన్నిచ్చే— ఎరువు — దున్నటానికి పనికివచ్చే ఎడ్లూకూడా లభిస్తున్నాయి. పశువులకు వ్యాధి సంక్రమించకుండా చూసుకోవాలి — మేలురకం పశువులనే పెంచుకోవాలి. "గుఱ్ఱం గుడ్డిదైనా దాణాకు లోటుండదు" పెట్టేదాణా ఎల్లాగు తప్పదు కనుక మంచిజాతి పశువులను కొనుక్కోవడమే తెలివైనపని. పెట్టుబడికి తగిన లాభం కనబడుతుంది. సాధారణంగా పశువు ఆరు సంవత్సరాలు జీవిస్తుంది. బాగామేపి జాగ్రత్తగా పెంచితే పన్నెండు సంవత్సరాలుకూడా వుంటుంది. చూశారా — మనం జాగ్రత్త వహించినందువల్ల ఎంత లాభంవుందో !

**పెట్టుబడిదారు:**—రైతులకి పెట్టుబడి నిమిత్తం — ఆర్థిక సహాయం చెయ్యటం — భూసారాన్ని పెంచేవాటికీ — కొత్తరకపు పరికరాలు తెప్పించడానికీ — గృహపరిశ్రమలకీ — సామాన్యవడ్డీని ఆశించి అప్పులివ్వాలి. దుబరా ఖర్చులకీ — దుర్మార్గపు పనులకీ అప్పులీయకూడదు. గ్రామస్థులు ఆర్థికంగా బాగుంటేనే తనుకూడా బాగుంటాడు - గ్రామం అభివృద్ధిలో వుంటేనే ఆ గ్రామంలో తను జీవించటానికి అవకాశంవుంటుంది. పెట్టుబడులుపెట్టి పేరు తెచ్చుకోవాలి. పదికొంపలు నిలబెట్టటానికి ప్రయత్నించాలిగాని, కొంపలకి కొరివిపెట్టకూడదు - ఈ ఆధునికయుగంలో ఇక దానికి వీలుపడదుకూడాను - సోషలిష్టుసమాజస్థాపనజరుగబోతోంది. డబ్బును ఒకచోట పేరుకు పోనివ్వరు - చేసేపనులు ఉభయతారకంగా ఉండేటట్లు చేసుకోవడం మంచిది. సహకారభావంతో చేసినవే - శాశ్వతంగా వుంటాయి - తరతరాలుగా నిలుస్తాయి - ఆరూపోరూలేకుండా అనుభవించటానికి వీలవుతుంది.

**వర్తకులు:**- వర్తకులు వారికి గ్రామానికికావలసిన సరుకులు తెప్పిస్తారు - మంచిసరుకులు తెప్పించాలి. కల్తీచెయ్యకూడదు. తాత్కాలిక ప్రయోజనంకోసం కక్కుర్తిపడితే - తరతరాలుగా విచారించవలసివస్తుంద. లోకంయొక్క పోకడని గమనించడం - తద్వతుగా వ్యవహరించడం నేర్చుకోవాలి- తమ వర్తకవ్యాపారాల వృద్ధిక్షయా - గ్రామం మీద ఆధారపడి వున్నాయి. కమ్మరులు, కుమ్మర్లు - వడ్రంగులుకూడా గ్రామాభ్యుదయానికి తోడ్ప

డాలి. తాముచేసే వృత్తులలో తమకు శరీరశ్రమను తగ్గించే యంత్ర పరికరాలు ఉపయోగించటం తెలుసుకోవాలి. వ్యవసాయంలోను, ఇతరపరిశ్రమలలోను ఉపయోగించే యంత్రాలను బాగుచేయడం కొన్నిటిని తామేస్వయంగా చేసుకోవడంకూడా నేర్చుకొని గ్రామాభివృద్ధికీ తద్వారా తమ పురోభివృద్ధికీ పాటుపడాలి. గ్రామాలలోగల అధికారులంతా గ్రామాభివృద్ధికి తోడ్పడవలసిన వారే - గ్రామకరణంగారు - మునసబుగారు - వైద్యుడు - ఉపాధ్యాయుడు - పోష్టుమాష్టరు - పంచాయితీ ఆఫీసరు - వీరంతా గ్రామాలలోని పార్టీలలోచేరి కక్షలు కార్పణ్యాలు వృద్ధిచేయడంమంచిదికాదు - గ్రామస్థులను ఏవగించుకోవడంకూడా ప్రమాదకరమే - వారికిప్పుడువున్నా పరిస్థితులు తమకునచ్చకపోవచ్చు — వారి ప్రవర్తనలో లోపం వుండవచ్చు— వారికి సభ్యత తెలియకపోవచ్చు - ఈ అధికారులు తమకున్న సద్గుణాలనీ - సభ్యతనీ - వారికి నేర్పవచ్చునుకదా! వారనుసరించే అక్రమ పద్ధతులని సక్రమపద్ధతిలో పెట్టవచ్చునుకదా! వారిలోగల అవినీతినిపోగొట్టి పునీతులుగా చేయవచ్చును. వారి అజ్ఞానాన్ని తొలగించి సుజ్ఞానులుగా మార్చవచ్చు- వారిలోగల కక్షలను కార్పణ్యాలను పోగొట్టి — వారిమధ్యగల సమస్యలను - సమరసభావంతోను — నిష్పాక్షిక దృష్టితోను — పరిష్కరించి ఆగ్రామంలో శాంతిని సాధించవచ్చును.

ప్రభుత్వ ప్రతినిధులై — పల్లెప్రజల అభివృద్ధికి పాటుపడవలసినవారు అధికారులే! పక్షములు వహించి పల్లెగ్రామాన్ని పాడుపెట్టగలవారువీరే!

—o—

# సంఘ సేవకులు

ప్రతి గ్రామంలోను సంఘసేవకులుండాలి. వీరు ఎలావుండాలి? ఎట్లాపనిచేయించాలి? అన్నవిషయం చాలా ముఖ్యము. మొదట గ్రామసేవకులు పునర్నిర్మాణంలోను - పురోభివృద్ధికి పథకాలు వేయడంలోను శిక్షణపొందియుండాలి. అటువంటివారు గ్రామానికి ఒక్కరున్నా చాలు. ఆగ్రామంలోవున్న ప్రతి గృహస్థునీ సభ్యునిగా చేర్పించి ఒక సంఘము ఏర్పాటుచేయాలి - ఈ సంఘము పూర్తిగా ప్రజలు ఏర్పాటు చేసుకొన్నదే. ప్రభుత్వానికి ఇందులో ఏమీ సంబంధముండదు; అయితే ప్రభుత్వాధికారులు కూడా ఆ గ్రామంలో ఒక బోర్డుక్రింద ఏర్పడి - తగు సలహాలుయిచ్చి-ప్రభుత్వము చేయవలసిన సహాయమును చేయిస్తూవుంటారు. ప్రతిగ్రామంలోను ప్రభుత్వము తరఫున పనిచేసే అధికారులున్నారు గదా! పాఠశాలకు చెందిన - ఉపాధ్యాయుడు - పంచాయితీ బోర్డు సభ్యుడు లేక అధ్యక్షుడు - వైద్యశాలకు చెందిన డాక్టరు లేదాశిశుసంరక్షణాలయానికి చెందిన సిబ్బందీ - గ్రామ కరణము — మునసబు - పోష్టు మాష్టరు మొదలైన ప్రభుత్వోద్యోగులుంటారు - వారితోకూడిన ఒకసలహాబోర్డును ఏర్పాటుచేసి - ప్రభుత్వమునుండి గ్రామమునకుకావలసిన సహాయ సంపత్తిని పొందుతూవుండవచ్చు.

ప్రజలతో కూడిన గ్రామాభివృద్ధి సంఘమేవారి గ్రామానికి కావలసిన విషయాలు ఆలోచించి తెలుసుకుంటూవుండాలి. కార్యరూపంలో పెట్టేముందు - ప్రభుత్వ ప్రతినిధులతో కూడిన సలహాబోర్డు వారి అనుమతినికూడ పొందటం మంచిది.

సంఘసేవకులు గ్రామసంఘముతో చాలా జాగరూకతతోను - విశ్వాసపాత్రులుగాను వ్యవహరించవలసివుంటుంది. తాము గ్రామస్థులకంటే అధికులమనిగాని - విద్యావంతులమనిగాని ప్రకటించుకోకూడదు. తాము ప్రభుత్వ తాబేదారులమనుభావమును ప్రజలకు కలిగించకూడదు. గ్రామములు పురాతనమైనవి - గ్రామ ప్రజలకు సలహాలివ్వడంలోను - సహాయపడటములోను వినయవిధేయతలు కనబర్చాలి - అక్షరాలా గ్రామసేవకులనే భావముతో ప్రవర్తించాలి. ప్రతివిషయము ప్రజలముందుపెట్టి - ప్రథమంగా వారి అభిప్రాయాన్ని తెలుసుకోవాలి. ఆ విషయములు ఎంతవరకు ఆచరణయోగ్యమో వారిచేతనే

చర్చింపించాలి - సత్యమైనవిషయమును ప్రజలే గుర్తించువిధముగా సంఘసేవకులు ప్రచారంచేయాలి. వారి ఆచారములను వ్యవహారములను - నిర్దాక్షిణ్యంగా విమర్శించకూడదు - గ్రామస్థులు — వారి పద్ధతులు అతిపురాతనమైనవి - వారినమ్మకములు, దేముళ్లు — దేవతలు — అతిపవిత్రములైనవి. దేశంలో సత్యము — ధర్మము తలదాచుకొనియున్నది ఇంకా గ్రామాలలోనేసుమా! వారి పవిత్ర జీవితాన్నిగాని, వారి పవిత్రాశయాలనుగాని — వారి మతాచారములనుగాని — ఖండించి మాట్లాడినట్లైతే— సంఘసేవకులు ఆశయమే నెరవేరదు — ఆగ్రామంలో ఏ అభివృద్ధి కార్యక్రమముజరుగదు — ఆ - గ్రామప్రజలు ఏమీ సహకరించరు — జాగ్రత్త! వాస్తవానికి సంఘసేవకులు — గ్రామస్థులకంటే ఏమీ అధికులు కారుకదా! కాకపోతే కొన్ని ప్రాథమిక సూత్రాలతోకూడిన శిక్షణనుగ్రామపునర్నిర్మాణంలో పొందియున్నారు — అంతేకదా! ప్రజలతోపాటే సంఘసేవకులుకూడా — పార, గునపముపట్టి పని చేయాలి. సంఘసేవకులుకూడ ప్రజలతో సమానమే — ప్రజలోనివారే. గ్రామస్థులు — సంఘసేవకులయందు విశ్వాసముంచి—వారిసలహాలనుఅడిగి తెలుసుకునేటట్లు వారునడుచుకోవాలి. సంఘసేవకులుప్రభుత్వజీతగాళ్లని తెలిస్తే ప్రజలకు వారియందు విశ్వాసముకలుగుట కష్టము — కనుక సాధ్యమైనంతవరకు స్వచ్ఛంద సేవకులనే ప్రతిగ్రామమునందు ఏరి — వారికి శిక్షణ యిచ్చుట శ్రేయస్కరము — ఇటువంటి స్వచ్ఛంద సేవకులు గ్రామాలలో లేకపోవడం చేతనే—గ్రామాలలో ఏ పనీ జరుగటంలేదు — జరిగిన పనులయందు — ప్రజలకు విశ్వాసము — ఆసక్తికలుగుటంలేదు - లక్షలు ఖర్చుపెట్టి కార్యక్రమాలు నడిపించినా ప్రజలు నిర్లక్ష్యమునే చూపుతున్నారు!

సంఘసేవకులకు క్రమశిక్షణ — నిజాయితీ చాలా అవసరం. ఇట్టి సంఘసేవకులు — స్త్రీలు కూడా వుండాలి — స్త్రీ సమాజములు స్థాపించటం చాలా అవసరం — స్త్రీలలో సంచలనము బయలుదేరితేనే గాని, గ్రామములో ఏపనీ జరుగదు — గ్రామంలో జరిగే ప్రతీ కార్యక్రమం స్త్రీలకు ముందు నచ్చేటట్లు వుండాలన్నా తప్పలేదు.

గ్రామంలో అభివృద్ధి — ఆర్థికంగాకంటే ముందు సాంఘికముగా జరుగాలి. సాంఘికవ్యవస్థను పునరుద్ధరించడంలో సంఘసేవకులు చాలా జాగ్రత్త వహించాలి. గ్రామంలోని సాంఘికవ్యవస్థ ఈ నాటిదికాదు, అతి ప్రాచీనమైనది — అనేకదాడులకు దహనాలకు తట్టుకొని ఈనాటికీ సజీవంగావుంది. అటువంటి వ్యవస్థను తారుమారు చేయటం మనతరం గాదు సరికదా బ్రహ్మతరంకూడాకాదు. అది సత్యము — ధర్మము ప్రాతిపదిగా నిర్మింపబడింది. అయితే దానిని అధునాతన పద్ధతులకు అనుగుణ్యంగా తీసుకురావాలి. సనాతనధర్మములను చంపదలచుకున్నవాడు — వాని చావును వాడు కొనితెచ్చుకున్నవాడుకాగలడు — జాగ్రత్త! అది గ్రామ సేవకులపనికాదు. అది మత సంస్కర్తలు — అవతార పురుషులు చేయవలసిన పని.

"గుడిచుట్టూ విద్యుద్దీపాలు పెట్టుతానంటే — నిన్ను ఎవ్వడూ ఏమీఅనడు — గుళ్లోదీపం పెట్టవద్దంటే మాత్రం కొంపమునుగుతుంది. చావుతప్పి కన్నులొట్టపోతుంది"

గ్రామంలో సాంఘికవ్యవస్థను పునరుద్ధరించటం ప్రమాదకరమని — నీవు మానటానికీ వీలులేదు — సాంఘికంగా ప్రజలు అభివృద్ధి పొందితేనేగాని — ఆర్థికంగా అభివృద్ధి చెందినా ప్రయోజనముండదు గనుక—గ్రామప్రజలకు లోకజ్ఞానం కలుగచెయ్యాలి— ఆరోగ్యపద్ధతులు తెలియచెయ్యాలి — ఉన్నతమైన ఆశయాలతో ఉదాత్తమైన జీవితం గడపటంనేర్పాలి.

గుడిశలోభార్య గర్భవేదన పడుతూవున్నప్పుడు— మారెమ్మనో — మహంకాళమ్మనో కొలుస్తానంటాడు — తప్పలేదు — వారి ఇష్టదైవాన్ని వారు కొలువనియ్యి—దానికి అభ్యంతరంపెట్టకు — బ్రాహ్మణుడు మంత్రించియిచ్చిన నీళ్లు ముందుగా ఇస్తా

నంటాడు — ఇవ్వనీ వద్దని చెప్పకు — ఇప్పటికి మూడు కాన్పులు ఎరుకమ్మ పోసింది — ఆనవాయితీ ప్రకారం ఆమెయే ఈ కాన్పుకీ రావాలంటాడు — ఏమి అడ్డు చెప్పకు — నీవు మాత్రం శిక్షణపొందిన మంత్రసానిని వెంటబెట్టుకొని వెళ్ళు — సుఖప్రసవానికి దోహదమిచ్చే — వైద్యసహాయం చేయించు — అంతే — అంతవరకే నీవిధి — అందులో ఉన్న మంచి చెడ్డలు అతడే గ్రహిస్తాడు — మరో కానుపుకి మరి డెమ్మను వదిలేసి మనదగ్గరకే వస్తాడు — అంతే గాని అతని నమ్మకాలను ఆచారవ్యవహారాలను విమర్శించటం సంఘసేవకుల పనికాదు —

గుడిశలో మశూచివచ్చింది — అతని బిడ్డను ఆస్పత్రిలో చేర్చటానికి ఒప్పుకోడు — అమ్మవారికి పూజా పునస్కారాలుచేసి — మర్యాదగా సాగనంపాలంటాడు — సాంబ్రాణి పొగవేసి — వేపమండతో విసరాలంటాడు. అట్లాగనే చేసుకొని — ఇంట్లోవున్న వారికందరికీ టీకాలువెయ్యి — ఆ ఇంటికి ఎవ్వరినీ రాకుండాచూడు — పరిశుభ్రతకు కావలసిన ఏర్పాటులన్నీ స్వయంగాచెయ్యి — లేదామంచిమాటలతో నచ్చచెప్పి — ఆస్పత్రిలో చేర్పించు. ఇది అంటు వ్యాధి — గుడిశలోవుండకూడదు — ఆస్పత్రిలో రోగిని ప్రత్యేకించాలి — అక్కడా మందూ మాకూ వేయరు — కాలవిరేచనం కావటానికీ — టెంపరేచరు హెచ్చకుండావుండటానికీ - జాగ్రత్త తీసుకుంటారనీ చెప్పు — వైద్యుని చేతిలో అతని బిడ్డవుండటం అన్ని విధాలామంచిది. అతనికీ ఇతరులకీ కూడా మంచిది. అమ్మవారికిచ్చే ధూపదీపనైవేద్యాలు — అతడు ఇంటివద్ద జరిగించుకోవచ్చు — ఇట్లా జరుగుటం ఇతరులదృష్టిలో చాలా అవసరమని నచ్చ చెప్పి— ఒప్పించి — బిడ్డను ఆసుపత్రిలో ప్రవేశపెట్టాలి. భయ పెట్టి అధికారం చలాయిస్తే — వ్యాధిని కప్పిపెట్టుతాడు — ఆ గుడిశలన్నిటికీ ప్రమాదం ఏర్పడుతుంది. నచ్చచెప్పడం సంఘసేవకులకి తెలియాలి.

ఇట్లాగే ప్రతివిషయము ఆలోచించి — అతిజాగ్రత్తగా అమలుపరచాలి సనాతన వ్యవస్థకు ముప్పంలేకుండా — అధునాతనపద్ధతులు పల్లె ప్రజలు ఆచరించేటట్లు చూడటంలోనే సంఘసేవకుల శక్తిసామర్థ్యాలు యిమిడివున్నాయి.

సాంఘికాభివృద్ధిని చెందిన పల్లెగ్రామాలు — ఆర్థికాభివృద్ధినికూడ అతిత్వరగా పొందుతాయి. సంఘసేవకులు — విషయపరిజ్ఞానముకలవారై ఓర్పువహించి — ధైర్యంగా సమస్యల నెదుర్కొంటే — గ్రామపునర్నిర్మాణము సులభమవుతుంది. సహనము దీక్ష — త్యాగబుద్ధి—సేవాసక్తి మాత్రం సంఘసేవకులకు ఉండితీరాలి.

# జర్మను కథలు గాథలు



బంగారు నాణాలసంచి

తన కొడుకును ప్రొద్దున్నే లేచి పాఠములు చదువుకోమని వాళ్లనాన్న పదేపదే చెప్తుండేవాడు. అబ్బాయికి నిద్రపోవటంలోనున్నశ్రద్ధ పాఠములపట్ల నుంటేగా! అంచేత యింకొక విధంగా చెప్పితే కొడుకు వింటాడేమోనని "అబ్బాయీ! వేకువజామున్నే లేచి మన తోటలోకి షికారు వెళ్ళావంటే బంగారు నాణాలసంచి దొరుకుతుంది. దాన్ని కాల్లతన్నుకునే దురదృష్టవంతు డెవడైనా యుంటాడా!" అని కొడుకుతో అన్నాడు.

తండ్రికంటె రెండాకులు ఎక్కువ చదివిన కుమారుడు ఆ మాటలకు "అదేమిటి నాన్నా! ఆ మూటను పారేసుకున్నవాడే దానికోసరం ఆ పరిసరాలలో తిరుగుతుంటాడుకదూ! వాడినే వేకువజామున లేచి పొమ్మందాము - అతనికే ఆ సంచి దొరుకుతుంది పాపం!" అన్నాడు.

మతి మరుపు

శాస్త్రవేత్త న్యూటన్ తనగది అస్తమానము చలిరోజులలో వేడిగా నుండటానికి మంటవేయమని నౌకర్లతో చెప్పేవాడు. వాళ్లు యజమాని ఆజ్ఞలను యథాతథంగా శిరసావహించేవారు.

ఒక రోజున భగభగమండుతూవున్న మంటకు సమీపాన్నే కూర్చొని న్యూటన్ ఏదో గడ్డు సమస్యను తేల్చడంలో ఆలోచనలో మునిగియున్నాడు. చప్పున ఏం తట్టిందో - ప్రక్కనున్న గంటను గణగణ కొట్టాడు. నౌకరు తలుపు తెరచుకుని గబగబవచ్చాడు. యజమాని ఎందుకో మండుతున్న నిప్పువైపుచూస్తూ చీకాకు పడుచుండుటనుచూచి మర్యాద ననుసరించి ఆయన వెనుకకువెళ్ళి 'ఏమి ఆజ్ఞ' అన్నట్లు నిలబడ్డాడు.

"మంట ఆలా మండుతుంటే నా పనిని నేనెలా చేసికోకలుగుతాననుకున్నావు! చప్పున దాన్ని ఆర్పెయ్యి" అన్నాడు యజమాని.

"అంతేగదా! - మరేదో కొంపమునిగిపోయిందని భయపడుతూవచ్చాను. మీరు మంటకంత దగ్గరగా కూర్చుంటే మంట తెత్తక మరెలాగుంటుందనుకున్నారు! కొంచం యివతలికి జరిగి కూర్చుంటే అంతా చక్కబడుతుంది" అన్నాడు నౌకరు.

"అలాగా! ఆ సంగతి తెలిసియుంటే యింత కంగారుపడటానికి అవసరమే యుండేదికాదు. ఇక నీవు వెళ్లవచ్చు" అంటూ యజమాని యివతలికివచ్చి

కూర్చొని ఆలోచనా సముద్రంలో మునిగి పోయాడు న్యూటన్.

ఏనుగు కోపం

రొట్టెలు తయారుచేసేవాడు రొట్టె లతో నిండియున్న గంపను తలమీదనుంచు కొని, చేతిలో గోధుమపిండి మూటపట్టు కొని ఆ యూళ్ళో ఆదరా బాదరా నడుస్తు న్నాడు. కొంతదూరం వెళ్లేసరికి ఒక ఏనుగ తన కెదురురావడంచూచి సంచి లోని గోధుమపిండిని దాని కందిచ్చు బోయాడు. ఏనుగకు కావలసింది రొట్టెలు కాని గోధుమపిండి కాకపోవడంవలన పెచ్చుపెరిగిన కోపంతో వాడి తలమీది గంపను తొండంతో త్రోసేసింది. రొట్టె లన్నీ క్రింద చిందర బందరగా పడి పోయాయి. రొట్టెలవాడు కంగారుపడుతూ నిలబడ్డాడు.

ఏనుగకు కావలసిన ఒకటి రెండు రొట్టెల నిచ్చినట్లయితే రొట్టెలవాడికింత గొడవ జరిగియుండేదికాదు.

చక్రవర్తిగారి దర్జీ

ఆ రోజుల్లో జర్మనుదేశానికి ప్రధాన మంత్రిగానున్న బిస్మార్కు రాజధాని నగరమైన బెర్లిన్ నగరంలో ప్రదర్శించబడు తున్న నాటకాన్ని చూడటానికివచ్చాడు. తనతోబాటు నాటకం చూడటానికి వచ్చినవాళ్లంతా వాళ్ల వాళ్లస్థానాలలో కూర్చొనియుండటం చూచాడు. వారిలో రాజాధిరాజులు, మంత్రులు, కోటీశ్వరు లైన వర్తకశిఖామణులు, రాజకీయోద్యో గులు, చుట్టుప్రక్కల ప్రాంతాలనుండి ఆప్రదర్శనాన్ని చూడటానికివచ్చినవారనే కులున్నారు. బిస్మార్కు తనకు ప్రత్యేకంగా అమర్చబడియున్న ఆసనంలో కూర్చునే దానికిముందు అక్కడనున్నవారిని పలక రించసాగాడు. వాళ్లమధ్యనచక్రవర్తిగారి దర్జీ కూర్చొనియుండడంచూచి ప్రధాన మంత్రి ఆశ్చర్యపడి అతనిని పలుకరిస్తూ "నీవూయివ్వాళ యిక్కడికివచ్చావా! అలా రావడానికి ఏదో ప్రత్యేకమైన కారణ ముండియుండాలి" అన్నాడు ఛలోక్తిగా.

దర్జీ "ఈఛలిరోజుల్లోహాయిగాయింట్లో కూర్చొని కాలక్షేపంచేయకుండా యిలా రావడమంటే నాకెంతోబో లేదు పనియుంటే కదూ! మనచక్రవర్తిగారే ఆజ్ఞయిచ్చారు - యీ నాటక ప్రదర్శనానికి రమ్మనమని. ఆయనకు పక్రోత్తదుస్తులను చూచినా మహాసరదాకాబట్టి ఆయనకునచ్చిన మోస్తరు కత్తిరించి కుట్టవలసివస్తుందని తయారుగావచ్చాను" అని వినయవిధేయ తలతో జవాబుచెప్పాడు.

"ఆపనిమాత్రం యీ రోజుచేయవాక. అది మొదలుపెడితేకానికి ఆదిఅంతమంటూ యుంటాదా!" అంటూ బిస్మార్కు ముందుకు నడిచాడు.

## కుక్క విశ్వాసం

స్వీడన్ దేశపురాజు యుద్ధరంగాలను చూడడానికి బయలుదేరేటప్పుడు తన స్నేహితుడు బహుమానంగా నిచ్చిన కుక్కను వెంటబెట్టుకొని వెళ్లేవాడు.

ఆరోజుల్లో జరుగుతున్న యుద్ధం పోలండు దేశంలో. పోలండుసైనికులు స్వీడను సేనను హతమార్చడానికి శతవిధాల పోరాడుతున్నారు. దీన్నిచూచి రాజు హడలిపోతున్నాడు. ఒకరోజున ఆయుద్ధరంగమును స్వయంగా చూడటానికని కుక్కముందునడుస్తూ దారి చూపుచుండగా రాజువెంట నడువసాగాడు. ఆ సంగతిని శత్రుసేనపసికట్టి గుండ్లువ్రేల్చింది. ముందు నడుస్తున్న కుక్క ఆగుండు దెబ్బకు గురియై ప్రాణంవదిలింది. తనకుక్క యిలాప్రాణాలను వదలటంచూచి రాజు చాలవిచారపడ్డారు. దానిశవాన్ని స్వదేశానికి తెప్పించి రాజలాంఛనాలతో పాతిపెట్టించి పెద్ద సమాధిని కట్టించాడు. ఆ సమాధిమీద 'నన్ను రక్షించిన విశ్వాసపాత్రమైన కుక్కయిక్కడ విశ్రాంతితీసికొంటున్నదని రాజుశాసనం చెక్కించాడు.

'జర్మన్'

—:o:—

# నిప్పుకు కాలని బట్ట

లోహ పరిశ్రమలో మూసలోకి కరిగిన లోహం ప్రవహించేటప్పుడు ఒక నిప్పురవ్వ కార్మికుని బట్టమీద పడితే అది మండిపోతుంది. అందుకని అతడు, ప్రత్యేకంగా తయారైన జాకెట్టు వేసుకుంటాడు. నిప్పురవ్వ దానిమీద పడినా అది కాలదు. ఎందుకంటే ఆబట్టమీద ఒక పలచటి ఉక్కు పొర వుంటుంది. ఈ చిత్రమైనబట్ట మా స్కోటెక్స్టైల్ సంస్థలో తయారైంది.

ఉక్కు కార్మికులు, వెల్డర్లు, ఫౌండ్రీ కార్మికుల కోసమేకాకుండా హైవోల్టేజ్ లైన్స్ మీద పనిచేసే విద్యుచ్ఛక్తి కార్మికుల కోసంకూడా యీబట్టల నమూనాలు తయారు చేయబడ్డాయి. పలచటి రాగిపొరతో కప్పబడిన దుస్తులు, ఎలక్ట్రీషియన్‌ను విద్యుచ్ఛక్తిరవ్వలవల్ల ప్రమాదంలేకుండా కాపాడతాయి.



# బాలవినోదం

## రంగడు — రాకుమారి

శ్రీమతి కొండూరి రామసీతమ్మ

(గత సంచిక తరువాయి)

తెల్లవారగానే ముసలిదాసీ రాజాగారివద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పింది. వెంటనే మహారాజా, రాణీ, ప్రధానమంత్రీ, కొంతమంది భటులతో ఆ గుర్తువేసియున్న ఇంటికోసం వెతకటానికి బయలుదేరారు. "ఇదిగో, ఈ యిల్లే గుర్తువేసివుంది." అన్నాడు మహారాజ పెద్దబజారులోని మొదటిఇంటిని చూపిస్తూ "మహారాజాకు దృష్టిలోపంగూడ వచ్చినట్లుందే" అంది వ్యంగంగా మహారాణీ. "ఆ యిల్లు కాదండీ యిది" అని ఇంకొక యింటికి చూపించింది. ఆ యింటి మీద గూడా అదే గుర్తుంది. "లేదు మహారాజా యీ ఇల్లు యిటు రండి. గుర్తు చక్కగా తెలుస్తోంది" అని వేరొక యింటిని చూపుతూ మంత్రి అన్నాడు. అలా తలావకళ్ళు తలా ఒక యింటిని చూపుతూ ఈ ఇల్లంటే ఈ యిల్లన్నారు. అంతా గందరగోళంగా తయారయింది వారి అన్వేషణ. మహారాజుకూడ అప్పటికి అర్థం చేసుకున్నాడు అన్ని యిండ్లమీదా అదేగుర్తున్నట్లుగా ఇక కనుక్కోవటం దుర్లభమని రాజు సపరివారంగా కోటకు వెళ్ళాడు.

మహారాణీ అతి తెలివైనది. ఎంతటి క్లిష్టసమస్యలనైనా యిట్టే పరిష్కరించగల సమర్థురాలు. కోటకు చేరంగానే ఆలోచించింది. వెంటనే ఒక వుపాయం తట్టింది. సిల్కు చీరెను తెప్పించి దానిని కత్తెరతో ముక్కలు ముక్కలుగా కత్తిరించింది. వాటన్నింటినీ చేసి ఒక చిన్న అందమయిన చిల్లులు సంచీగా తయారుచేసింది. ఆ సంచీనిండా బియ్యపు పిండిపోసి ఆ రాత్రి రాకుమారి నిద్రపోగానే ఆమె నడుముకు రహస్యంగా కట్టించింది.

ఆ రాత్రి కుక్క మామూలుగావచ్చి రాకుమారిని తీసుకుపోయి రంగడి గదిలోని పాన్పుమీద పడుకోబెట్టింది రంగడు ఆమెను చూడగానే అమితానందం పొందాడు. రంగడుకానీ కుక్కగానీ ఆమె నడుముకు కట్టబడివున్న చిల్లిపిండి సంచీని గమనించలా. సంచీలోని పిండి అంతా రాజమందిరం నుంచి రంగడిగదివరకూ కొంచెం కొంచెంగా కారింది. కొంతసేపటికి కుక్క రాకుమారిని మోసుకెళ్ళి కోటలోని ఆమె పాన్పున పరుండబెట్టి మాయమయింది.

మరుసటిరోజు ఉదయం మహారాజా, మహారాణీ సపరివారంగా ఆ పిండిపడివున్న మార్గాన్నే వచ్చి రంగడిగదికిచేరారు. రంగడిని చూడంగానే మహారాజా ఉగ్రుడయి వెంటనే ఖయిదులో పెట్టమని ఆజ్ఞయిచ్చి కోటకు తిరిగివెళ్ళాడు. రంగడికి ఏమీ పాలుపోలా. తనను ఎలా కనుక్కొన్నారాయని విస్తుపోయాడు. వెంటనే రాజభటులు రంగడిని కోటకు తీసుకుపోయి జైల్లో పెట్టారు.

మరుసటిరోజు పట్టణంలోని ప్రజలంతా గుంపులు

గుంపులుగా రంగడున్న జైలు ఎదురుగా పోతున్నారు. ఆ జనం రంగడిని గురించి అనేక విధాలుగా చెప్పుకుంటున్నారు. ఆ రోజు రంగడిని ఉరితీయబోతున్నారుట. అది చూచేదానికి ఆ పట్టణపు ప్రజలంతా పూరిబయటనున్న ఉరి కంభంవద్దకు పోతున్నారు. ఉరికంబంవద్ద శాంతిని కాపాడటానికి కాబోలు సైనికులు జట్లుజట్లుగా బ్యాండు వాయిద్యాలు ప్రోగించుతూ పోతున్నారు. ఈ కోలాహలం అంతా రంగడు జైల్లోనుంచి చూస్తూనే వున్నాడు. అప్పుడు తెలుసుకున్నాడు — తనను ఆ రోజు ఉరితీయబోతున్నట్లుగా. రంగడికి చాలా భయంవేసింది. ఏంచేయటానికీతోచలా. రేకుడబ్బా జ్ఞాపకంవచ్చి జేబులు తడుముకున్నాడు. అదిలేదు. ఒక వెండి నాణెంమాత్రంవుంది. ఆ పాతరేకు డబ్బాను తన గదిలోనే బల్లమీదవుంచి వచ్చాడు. ఇప్పుడు ఎలాగయినా దానిని సంపాదించాలి; ఎలాగాయని ఆలోచిస్తుండగా హోటలులో తన బూట్లుతుడిచే కుర్రాడు ఆ గుంపులో కనిపించాడు. రంగడికి ప్రాణం లేచివచ్చింది. వెంటనే వాడిని కేక వేశాడు. వాడు భయంతో రంగడివద్దకువచ్చి అతడి పరిస్థితికి చాలా విచారపడ్డాడు.

"ఒరేయి. నా గదిలో బల్లమీద ఒక చిన్న పాతరేకు డబ్బా మరచిపోయివచ్చారా. కాస్త అది తెచ్చిపెట్టు. నీకు ఒక వెండి నాణెం యిస్తా" అన్నాడు.

"ఓ. అలానేతెస్తా" అని చెప్పి సంతోషంతో రంగడి గదికి పరుగెత్తి మరుక్షణంలో డబ్బాతో తిరిగివచ్చాడు. రంగడు డబ్బాను తీసుకుని జేబులో పెట్టుకుని ఆ తెచ్చిన కుర్రాడిని ఆప్యాయంగా భుజానతట్టి వెండి నాణెం యిచ్చిపంపాడు.

పూరిబయట ఉరికంభంచుట్టూ ప్రజలు కిటకిటలాడిపోతున్నారు. రాజభటులకువాళ్ళని సర్దటం బహుకష్టమయింది. ఉరి స్తంభానికి ఎదురుగా మహారాజా, మహారాణీ, ప్రధానమంత్రీ తదితర ప్రముఖోద్యోగులు ఆసీనులయ్యారు. రంగడిని తీసుకురమ్మని అనుజ్ఞ అయింది. వెంటనే రంగడు ఒక బండిమీద కాలుచేతులు సంకెళ్లు వేయబడి ప్రవేశపెట్టబడ్డాడు. సేరుగా ఆ బండి ఉరికంబం ఎదుట ఆగింది. నలుగురు భటులు రంగడిని పట్టుకుని ఉరి స్తంభంమీద ఎక్కించారు. అన్నీ అయినయి. ఇక త్రాడువేసి బిగించటమే తరువాయి. ఇంతలో తలారివాడు రాజాగారికి నమస్కరించి "మహారాజా, చిన్న మనవి. ప్రతి వురితీయబడే వ్యక్తియొక్క కడసారి కోరికను అడిగితెలిసికొని అది చెల్లించటం సాంప్రదాయము" అన్నాడు. వెంటనే మహారాజా రంగడివైపు తిరిగి "నీ కడసారి కోరిక కోరుకో" అన్నాడు.

రంగడు నమ్రతగా "ఏమీలేదు మహారాజా. ఒకసారి చుట్ట కాల్చుకోవాలనివుంది. ఆఖరిచుట్ట కాల్చనీయండి" అన్నాడు. మహారాజా ఆమోద సూచకంగా తన చేతిని వూపాడు.

వెంటనే రంగడు తన జేబులోని పాతరేకు డబ్బాను అంతకుముందే జేబులో భద్రంగా పెట్టుకున్న రాతితో వరుసగా ఒకటి, రెండు, మూడు సార్లు కొట్టాడు. కొట్టిందే తడవుగా మూడు కుక్కలూ ప్రత్యక్షమయి "స్వామీ సేవకులకేమి ఆజ్ఞ" అని అడిగినయి. రంగడు పరమానందంతో "వీళ్లందరినీ చంపిపారెయ్యండి" అన్నాడు. అన్నదే తడవుగా ఆ మూడు కుక్కలూ రాజుగారినీ, మహారాణీనీ, ప్రధాన మంత్రినీ నోట కరుచుకుని ఆకాశంలోనికి ఎగిరిపోయి ఆ మీదనుంచి క్రిందకు వదలినయి. అంతటితో ఆ ముగ్గురూ యిహలోకం వదిలారు. తరువాత క్రమంగా తదితర ప్రముఖోద్యోగులనూ అలానే చంపినయి. అక్కడ గుమిగూడిన ప్రజలు భయకంపితులయి కాలికి బుద్ధి చెప్పారు. అందులో కొందరిని మూడు కుక్కలూ వెంటాడి పీకిచంపినయి.

అలా చావగా మిగిలిన ప్రజలూ, రాజసైనికాధికారులూ, తదితర ప్రముఖోద్యోగులూ రంగడివద్దకు వచ్చి "అయ్యా, మమ్ములను క్షమించండి. రాకుమారిని పరిణయమాడి మా రాజ్యాన్ని పాలించండి" అని ప్రార్థించారు.

రంగడు అందుకు సమ్మతించి మూడు కుక్కలనూ పిలిచి వాటిని పొమ్మని ఆనతిచ్చాడు. తను నేరుగా రాకుమారివద్దకువెళ్ళి ఆమె అనుమతితో ఒక శుభ ముహూర్తాన ఆమెని పరిణయమాడి ఆ రాజ్యానికి తను మహారాజుగా పట్టాభిషిక్తుడయి ప్రజలను సుఖంగా పాలించాడు.

-:సమాప్తం:-

## తెలివితక్కువ దొంగలు

శ్రీ ఎ. ఎ. ఎన్. రాజు

ఒక గ్రామంలో రామయ్య అనే రైతు ఉండేవాడు. రామయ్య ఒక గుమ్మడి పాదును తన పాకమీదకు ఎక్కించాడు. రామయ్య అదృష్టంవలన ఆ పాదు బాగ కాచింది. గ్రామంలోవున్న వారంతా రామయ్య పాదు బాగ కాయలు కాచిందని గుండెలు బాదుకుండేవారు. ఆ కాయలనుచూచి ప్రతివాడు అసూయపడసాగేవాడు. ప్రపంచంలో చాలమంది అసూయపరులేగా!

ఒకనాడు ఇద్దరు దొంగలు ఆ గుమ్మడి కాయలను కాజేయాలని వచ్చారు. ఆ రోజు అమావాస్యకావడంచేత కారు చీకటిగావుంది. ఒక దొంగ ఇంటిపైకిఎక్కి కాయలు తొందరగా కోస్తున్నాడు. రెండవవాడు ఆ కాయలను జాగ్రత్తగా అందుకొని క్రిందును ఉంచుతున్నాడు. ఇంతా కర్మవశాత్తు ఇంటిమీద చప్పుడు రామయ్యకు వినపడింది. మెల్లగా రామయ్య బయటకువచ్చాడు. రామయ్యను చూచిన వెంటనే క్రిందునున్న దొంగ పలాయనం చిత్తగించాడు. పాపం! చీకటిలో మీదనున్న దొంగ రామయ్యను చూచి తన స్నేహితుడే అనుకున్నాడు. ఇంకా తొందరగా కాయలుకోసి చీకట్లో అందిస్తుంటే రామయ్య వాటిని అందుకొని ఇంట్లో పదిలపరచాడు. కాయలు కొయ్యటం పూర్తి అయింది. రామయ్య చమత్కారంగా దొంగలయొక్క తెలివితక్కువకు నవ్వుకుంటూ వినపడేలాగున "కారుచీకటిగావుంది పాపం! అంత తొందరెందుకు, కాలుజారితే ప్రమాదం, నెమ్మదిగా దిగిరా నాయనా!" అని అన్నాడు. ఈ మాట విన్నతోడనే దొంగ గుండె ఆగిపోయినంతపనైంది. ఇక లాభంలేదనుకొని ఆ దొంగ బయట వీధి వైపునకు గెంతి పలాయనం చిత్తగించాడు. కష్టపడకుండా కాయలు ఇంట్లోకి వచ్చినందుకు రామయ్య సంతోషించాడు.

# లోకులు కాకులు

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

అనగా అనగా ఒక వూళ్ళో ఒక రాజుగారున్నారు. ఆ రాజు శుద్ధ అమాయకుడు. రోజూ ఒక విషయం తీసికుని అది నిరూపించకపోతే మంత్రిని తలతీస్తానని బెదిరిస్తుంటాడు. మంత్రి దినదిన గండంగా బ్రతుకుతుండగా ఒక రోజు రాజుగారు మంత్రిని పిలచి,

"మంత్రీ, లోకులు కాకులు అంటారే, అది నిరూపించాలి. నెల రోజులు గడువు" అన్నాడు. మంత్రికి మతిపోయినంత పనయింది. ఎలా నిరూపించడం ?

ఒక రోజున రాజుగారు మంత్రిగారు వేటకు వెళ్ళారు. ఆ కీకారణ్యంలో పొద్దుకుంకింది. విధిలేక ఆ ప్రాంతంలోనున్న ఒక పాకలో తలదాచుకున్నారు. తీరా ప్రొద్దునలేచిచూస్తే అది ఒక పందులపాక. అపుడు రాజు మంత్రితో "మంత్రీ మనమీపాకలో నున్నట్లు ఎవ్వరికీ తెలియకూడదు. ఎవరికన్నా తెలిసినదా నీ తల తీస్తా"నన్నాడు.

"ఇదేం ఖర్మంరా బాబూ" అనుకుని మంత్రి ఇంటికివెళ్ళిన తరువాత భార్యతో "రాజుగారు, రాత్రి వేటకెళ్ళినచోట పందులపాకలో నిద్ర పోయారు పాపం! ఈ సంగతి ఎవరికన్నా చెప్పావా, నీ తల, నా తల ఎగిరిపోతాయి జాగ్రత్త. నీ మనసులో ఉంచుకో" అని చెప్పాడు.

మరునాడు మంత్రి రాజ దర్బారుకు వెళ్ళినపుడు మంత్రి భార్య పనిగట్టుకు సేనాధిపతి ఇంటికివెళ్ళి ఆయన భార్యతో "ఏమమ్మా చెల్లమ్మా! చూచావా ఈ వింత. మన రాజుగారు, మా ఆయన వేటకెళితే, రాజుగారు అక్కడ పందుల దగ్గర పడుకున్నారుట. అదేం ఖర్మో !! ఈ సంగతి ఎవరికి చెప్పవద్దని మా ఆయన నాకు చెప్పారు. చెప్పితే తలలుండవు జాగ్రత్త అన్నారు. "నీవు నా ప్రాణ స్నేహితురాలివిగదా అని చెపుతున్నాను. ఎవరికి చెప్పకేం" అని అన్నది.

"అయ్యో అక్కా. నేనెందుకు చెపుతాను" అంది సేనాని భార్య.

సేనాని భార్య తన కుమారుని జన్మదినోత్సవ సందర్భంలో విందుచేసింది. అప్పుడు దళాధిపతి భార్యరాగా "ఏమే రమణాదేవీ! చూచావా ఈ వింత మన రాజుగార్కి వేటకెళితే పందులు దొరికాయట. ఆ పందులు మామూలు ఊరపందులుట. వానిని రాజుగారు కూరచేయించుకుని తిన్నారుట" అన్నది.

అలా అలా ఆ నోట ఆ నోటబడి చివరికి "రాజుగారు పందులు తిన్నారు" అని ఊరంతా తెలిసిపోయింది. ఈ విషయంవిన్న గూఢచారులు తోటమాలిని పట్టుకువచ్చి రాజుగార్కి చూపించి వాడన్న మాటలు రాజుకు చెప్పారు.

"ఏరా! ఏమిటీకూతలు" రాజుగారు గద్దించారు.

"నాకేం తెలీదండి. దళాధిపతిగారి భార్య ఎవరికో చెపుతుంటే విన్నానండి."

దళాధిపతి భార్యను పిలిపించారు. తద్వారా, చివరికి మంత్రిగారు చెప్పారని తెలిసింది. అపుడు రాజుగారు మంత్రినిపిలచి,

"ఏమిటిది మంత్రీ" అన్నాడు. మంత్రి వినయంగా "రాజా మీరు ఒక రోజున "లోకులు కాకులు" అని నిరూపించమన్నారు. ఎలాగా, అని ఆలోచించుచుండగా మనమానాడు వేటకు వెళ్ళిన రోజున చీకటిపడగా తెలియక ఒక పందులపాకలో నిద్రించాము. నేను పైసామెతను నిరూపించుటకు ఈ విషయాన్ని యథాతథంగా ఒక రాత్రి నా భార్యకు చెప్పాను. పైగా ఎవరికి చెప్పవద్దన్నాను. దానికి చిలవలు పలవలుపుట్టి చివరకు "రాజుగారు పందులు 'తిన్నారుగా' తయారయింది. చూచారా" అన్నాడు.

అపుడు రాజు మెచ్చుకుని మంచి బహుమతిఇచ్చి మంత్రిని సత్కరించాడు. చూచారా! బాలలూ మంత్రి తెలివి.

# సిరిసిరిమువ్వలు

ప్లీడరు, గుమాస్తాతో ''ఏమండీ ఇంత చిన్న అర్జీకి అందం కోసం ఇంత పెద్దకాయితం పాడుచేశారే. అన్నిటిలో పొదుపు అలవరచుకోవాలండీ. ఏదీ! ఇదిమళ్ళీ చిన్నకాయితంమీద వ్రాసుకురండి.''

♦ ♦ ♦

న్యాయాధికారి ముద్దాయి తో ''ఏమోయి నీవు ఆ వెంకయ్య తలమీద కొట్టావుట నిజమేనా.''

ముద్దాయి:—అసలు నే కొట్టలేదండి,

న్యా.-తలమీద ఇనపది తీసుకుని బలంగా కొట్టావంటున్నాడు?

ము:—ఇనపది కాదండి కఱ్ఱతోనేగా.

♦ ♦ ♦

ఇద్దరు మిత్రులు కొవ్వూరు స్టేషనులో కలుసుకున్నారు.

ఒకడు:—ఏరా ఎక్కడదిగుతావు.

రెండవ:—గోదావరిలోరా.

ఒ:-అదేమిటిరోయ్ !!

గోదావరి నదిలోగాదురా, గోదావరి స్టేషనులో.

♦ ♦ ♦

ఒకపల్లెటూరి ప్రయాణీకుడు రైల్వే బుకింగు ఆఫీసువద్ద ఇలా అడిగాడు.

ప్ర:—మా వీరయ్య మామ వూరికి ఒక టిక్కట్టు ఇవ్వండి.

గుమాస్తా:—ఏవూరయ్యా మీమామవూరు?

ప్ర:—ఆమాత్రం తెలీనిదే నీవిక్కడెందుకయ్యా. రాజీనామా దాఖలు చెయ్యి.

బొడ్డుపల్లి కృష్ణావధాని

...:::...

మాష్టరు:—రామూ! నీవంత దూరంగా కూర్చున్నావే, నీకేమన్నా వినబడుతున్నదా?

రాము :—ఓ! బాగానే కనుపిస్తున్నది సార్!

♦ ♦ ♦

కుంటివాడు:—బాబూ! రెండు కాళ్లూ లేనివాణ్ణి, ధర్మంచెయ్యిబాబూ! పుణ్యముంటుంది.

పిల్లవాడు:—పాపం! ఉంటే ఆలాగేచేసేవాణ్ణి. మా యింట్లో కాళ్లేమీ లేవబ్బీ!—ప్రక్కయింటికివెళ్లు.

♦ ♦

తండ్రి:—అదేమిటిరా! పుస్తకాన్ని రోట్లోవేశావు?

కొడుకు:—ఏంలేదునాన్నా! మా మాష్టరుగారు 'మీరు నేను బళ్లోచెప్పింది వింటే చాలదు; యింటికివెళ్లి పుస్తకాన్ని బాగా రుబ్బెయ్యాలి' అన్నారు —అందుకని...

♦ ♦ ♦

తండ్రి:—గాడిదకొడకా! అస్తమానం అబద్ధము లేనట్రా నీనోట వెలువడేది!

కొడుకు:—(మెల్లగా) ... అయితే మరి మీరో ....

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం :
డాక్టరు W. రాధాకృష్ణయ్య



ఇప్పుడు సత్యస్వరూప మొకటి యుండిన యెడల, ఆ సత్యస్వరూపునికి ఈ "నాకు"ను గల సంబంధమును తెలుసుకొన ప్రయత్నించెదము. ఈ దృశ్య ప్రపంచమున కానగు, రూప నామములు ఆ సర్వవ్యాపియగు పరమాత్మ సత్య స్వరూపునకు ఎట్లు అన్వయించును. జీవుడనిన నేమి? వ్యక్తీకరించిన ఏక స్థలవాస అహంకార స్వరూపమా? జగత్తనిన నేమి? దృశ్యబ్రహ్మాండమా? దేవుడనిన నేమి?

ఈ మూడు, ఈశ్వర, జీవ, జగత్తు, వీటి స్వరూపములను పూర్తిగా నెరిగినయెడల, వీటికిని ఆ పరమాత్మకును గల సంబంధమును తెలుసుకొన గలుగుదుము. అనగా ఈ "నేను, నేను" అను సర్వులలోగల అనుభవములకు, ఒకటి కొకటికి గల సంబంధమును, విచారించి కనుగొనవలెను. ఆ జగత్తునందుగల, సర్వజీవరాసుల సమిష్టి జ్ఞానస్వరూపమే దైవస్వరూపము. అనగా, మన భావములలో నుండు రామ, కృష్ణ, శివ, క్రీస్తు, మహమ్మదు, స్వరూపములు కావు. వీటి అన్నిటి సమిష్టి శక్తి, ఈ అవతారములన్నియు దైవ స్వరూప దృశ్యములే. దైవము యీ సర్వ జగత్తునకు కారణ శరీరము.

మనము యీ స్థూలమునకును, సూక్ష్మమునకును గల సంబంధము కనుగొన యత్నించుచున్నాము. ఈ కార్యము అంత సులభమైనదిగాదు. ఏలన, భావాతీత పరమాత్మను, భావానురూప భాషకు లోనగునటుల చేయ యత్నించుట నిష్ఫలము. భాష పరిమితి గలది. పరిమితిగల భాష పరిమితికి అతీతుడైన పరమాత్మను తెలుప జాలదు. గనుక వేదాంత మార్గమున ఉదాహరణముల, దృష్టాంతముల రూపమున, శిష్యులకు ఉపదేశములు చేయబడుచుండును. మఱి యీ దృష్టాంతములు ఉపదేశ మార్గమున అన్ని గుణములు ఏకీభావములని తెలుపుటలేదు. యేదో ఒకటి రెండు గుణములతో మాత్రము అనురూపము చూపబడుచుండును.

(సమానము).

### మచ్చుకు:--

వేదాంతమున పరమాత్మను ఆకాశమునకు పోల్చబడుట వాడుక. అనగా ఆత్మ సర్వవ్యాపియనియు, అసంగుడు, నిర్లేపుడనియు భావము. ఆకాశమునకు నందుగల వస్తువులకు సంపర్కమేమియు లేదు. ఘోర కృత్యములు జరుగుచుండినను, ఆకసము నిర్మలముగను, నిర్భావముగనుండును. పుణ్య యజ్ఞ కార్యములవల్ల, ఆకసము యొక్క పవిత్రత హెచ్చుగాంచుటలేదు. ఈ సూక్ష్మాతి గుణమునను, సర్వవ్యాపిత్వమునను, తన నిత్య పవిత్ర, నిర్మలత్వమునను, పరమాత్మను ఆకాశమునకు పోల్చబడియున్నది. దీని భావములనుగూర్చి వివాదములు అనవసరము. ఇట్లు పలుకుట వలన పరమాత్మయందు సూర్య, చంద్రులు, మేఘములు, వున్నవని తలంపరాదు. తాత్పర్యము అదిగాదు. దృష్టాంతముల మూలమున ఒకటి రెండు గుణములను భావింపనగుచున్నది.

జగత్తునకు పరమాత్మకును గల సంబంధముల్లలో కొన్ని దృష్టాంతములు తెలుపనగుచున్నది. ఈ దృష్టాంతములను మనము పరి పరి విధముల ధ్యానము చేయుటవలన వాటి సారమును, దివ్యరసానుభవమును మనము పొందగలుగుచున్నాము.

జీవునికి, జగత్తునకు, ఈశ్వరునికి గల సంబంధము ఒక వస్త్రమున, ఆ నూలుతోనే అలంకార చిత్రములు

అమర్చబడినటుల పోల్చవచ్చును. (బెడ్డు షీట్లు, టేబిల్ క్లాతులవలె). ఇచ్చట ఒక వస్త్రము యున్నది. ఆ వస్త్రము పేక, పైట, అను ఇరు దిక్కుల నూలుతో నేత నేయబడియున్నది. అందులోనే చిత్రములు కూడా అమర్చబడియున్నవి. ఆ చిత్రములు ఒక దర్శనమును ఇచ్చుచున్నది. అది ఒక కుటుంబము భోజనము చేయుచున్నటుల తీర్చబడి యున్నది. ఈ దృశ్యము సముద్రములు, భూమి, పర్వతములు, అడవులతో కూడిన జగత్తుగా చెప్పవచ్చును.

ఇప్పుడు ఈ వస్త్రము దేని ఆధారముతో యున్నది? నూలు ఆధారమువదలి, దానివ్యక్తిత్వము యున్నదా? దారములన్నియు విడదీసిన, వస్త్రము మిగ్లిలియుండగలదా? వస్త్రమంతయు దారమే. దారమును మనము గమనించక, వస్త్రమునుచూచి యది ఒక కుటుంబదృశ్యమని తలచుచున్నాము. ఇచ్చట ఆధారస్వరూపమైన "ఈశ్వరః సర్వభూతానాం." ఓ అర్జునా! నేను సర్వజీవుల హృదయములలో నివశించుచున్నాను. హారములోని దారమువలె అన్ని శరీరములతోనుండి వాటిని ఒకటిగా కూర్చియున్నాను. ఈ దృశ్యకుటుంబములో మూలాధారమేమి? దారముతప్ప వేరులేదు. దారములేక పోయిన దృశ్యములేదు. దైవములేనిదే జగత్తులేదు. కనుక యీ నామరూపములు స్పర్శఘ్రాణములు. శబ్దరసములు. బాహ్యప్రపంచ అనుభవములకు, కారణములగుచున్నది. ఈ జగదృశ్యములంతయు, సత్యస్వరూప భగవంతునియందు, ఏర్పడు దారపుపోగు. ఈ దైవాంశమును తొలగద్రోశిన జగత్తు శూన్యమగును. దారములన్నియు తీసివేశిన, వస్త్రము నూన్యమగును. దృశ్యచిత్రములలోనుండు వ్యక్తి దృశ్యమే, జగత్తున పూర్ణముగ వ్యాపించియుండు జీవుడు. దారము ఈశ్వరస్వరూపము.

ఈ దైవాంశమును, మరీ విశిదీకరించెదము. దారమును వివరించిన, దారమునకు ఆధారమేమి? యీ దారము స్వయంసృష్టి పొందినదా? శాశ్వతమైనదా? అది దానిలోనే పుట్టి దానితోనే వ్యక్తిత్వము కలిగి యున్నాదా? దానికి కారణాంశము యేమి. వస్త్రమునకు దారము కారణాంశముగాయున్నది. సరే! కాని, దారము తనకుతానే కారణాంశముగానున్నదా? దానికి కారణాంశము వేరేయున్నది. అదియేది? ప్రత్తి.

ప్రత్తిలేనిదే దారములేదు. దారము లేనిదే వస్త్రముగాదు. అందు దృశ్యచిత్రములులేవు. ప్రత్తియందుదారము, వస్త్రము, దృశ్యచిత్రములు యిమిడియున్నవి. ప్రత్తియందు యీ మూడును వుత్పన్నమైనవి. చివరమూడును ప్రత్తితోనే లీనముకావలయును.

పది బొమ్మలు వరసగా నిలువబెట్టబడియున్నవి. వాటికి రూపమునకు తగు పేర్లులున్నవి. పేర్లకు తగు రూపములున్నవి.. రూపానుగుణముగా పేర్లు మారుచున్నవి. నామానురూపముగా రూపములు మారుచున్నవి. కాని అన్నియు విరుగగొట్టిన అవి యేమగుచున్నవి? మన్ను. మన్నుగనే అవియుండెను. మన్నుతోనే రూపములుపొందెను. మన్నుతోనే అవి మరల లయించిపోయెను. వీటనన్నిటికి మన్ను సత్యస్వరూప నిత్యవస్తువుగా యున్నది. అట్లనే వస్త్రములోనుండు నిత్యవస్తువు ప్రత్తి. ప్రత్తి అంతయు తీసివేశినవస్త్రములేదు. అట్లనే వస్త్రమంతయుప్రత్తియని తెలుసుకొన గలుగుచున్నాము. దుకాణములోని వర్తకుడు వస్త్రములంతయు వస్త్రములని తలచుచున్నాడుగానీ, ప్రత్తియనితలచుట లేదు. అట్లు జీవితములో సత్యమును వెతకుచున్నాము. జీవితమే సత్యస్వరూపమని తెలుసుకొనలేకున్నాము.

సత్య స్వరూపుని దృశ్యమునకై పాటుపడుచున్నాముగానీ సత్యస్వరూపానుభవముపొంద యత్నించుట లేదు. జీవునికిని, దేవునికిని, గలసంబంధము, దారమునకును దృశ్యమునకును గలసంభందమువంటిది. దైవమునకొంతమార్పు తలచిన, దైవాంశము కలుగుచున్నది. దైవాంశమున కొంతమార్పుదలచిన మానవుడు కలుగుచున్నాడు. అనగా దృశ్యములో

నూలు నేచూచినటుల, మానవుడే దైవమని వూహించగలుగుచున్నాము. దారములో మార్పు ఏమియు లేదు. కానీ యీ భావములు మాత్రము, గోచరమగుచున్నవి.

వేదాంతమునందు సర్వవ్యాపి పరమాత్మ, స్వరూపమున యేమార్పును బొందుటలేదు. ప్రత్తి ఎట్టి అవస్తను పొందలేదు. ప్రత్తి, రూపభేదముచేత దారమాయెను. అదియే మరలా వస్త్రమాయెను. మనదృక్కోణమునుబట్టీ, వస్త్రముకూడా వివిధ ఆకారములను, పొందుచున్నది. ఒక్కసారి చూచిన బెడ్డుషీటువలెనున్నది. ఇది స్థూలరూపము. విమర్శించి చూచిన దారము కనబడును. మఱిపరిశీలించిచూచిన ప్రత్తి దర్శనమగును. ప్రత్తి దర్శనమయినవెనుక వస్త్రరూపభేదములు దూరమగును స్థూలదృశ్యమున వస్త్రముతో ఏకత్వములేదు. దారమును చూచిన యీ బహుదృశ్యములు క్షీణించుచున్నవి. ప్రత్తిదర్శనముతో వాటి ఏకత్వము స్పష్టమగుచున్నది. ఇదేరీతియే అలలు, నురుగు, బుడగలు, సుడులు, అన్నియు సముద్రస్వరూపమే. ఆకారముల దృశ్యముకొద్ది నామములు మారుచుండునుగానీ, సత్యవస్తువు ఒకటియే, సత్యదృష్టిలోభేదములేదు. బహుత్వములేదు. ఈ భావమును అనుసరించి ప్రవర్తించుటకు, మనకందరికిఒక్కొక్కరికి ఒక్కొక్క భిన్నరూపాకారములు సృష్టింపబడియున్నది. దృశ్యవస్తువులో వివిధరూపములుండుట వలన వాటిని వివిధనామములతో వ్యవహరించుచున్నాము. బ్రహ్మాండ ఏకస్వరూపమే సత్యస్వరూపాంశము... సత్యదృష్టినుండీ ప్రపంచమును చూచిన నిత్య అద్వైతమే[illegible]వగును. కనుక జీవునికి, జగత్తుకు, ఈశ్వరునికి నిత్య, సత్య, స్వరూప, పరమాత్మతోగల, సంబంధము విచారించిన, సంబంధము మాయమగుచున్నది. ద్వైతముండువరకే సంబంధమును సాగును. ఏకములో సంభంధమునకు ఆస్పదములేదు. మనకును ఈశ్వరునికిగల సంబంధమును, తీవ్రముగా ప్రయత్నించి గనుగొన తలచిన యెడల, ఎట్టి బేధములేదు. ఇదేరీతిని స్వర్ణమున "నేనే ఈశ్వరుడు" కానీ ఈ నేను అనునది ఏది? అదిగుర్తించుటలో చాలా ప్రమాదములు సంభవించుచున్నవి. నా నిజస్వరూపమును కనుగొని, అంతర్ దృష్టినుంచీ విచారించిన నాకు ఈ "నేను"అనునది, "నేనే ఈశ్వరుడు." అను తీర్మానము స్పష్టమగుచున్నది.

ఈ ఈశ్వర దర్శనము యొక్క పూర్ణానుభవము పొందవలయునన్న, సర్వవ్యాపి, నిత్య సత్య స్వరూపిని, పూర్తిగా తెలుసుకొనవలెననుకొన్న మొట్టమొదట ప్రేమభక్తులతో, అతనిని వెదుకవలెను. ఈశ్వరభక్తి సాధనమువల్లనే, పరమాత్మ దర్శనము, లభ్యమగును. ఈశ్వరభక్తి సాధనము వల్లనే, పరమాత్మదర్శనము లభ్యమగును. ఈశ్వర భక్తిలేనిది, అభివృద్ధిపొంద సాధనములేదు. అతని దూరదర్శనముకూడ సాధనములేదు. ఇది ఒక ముఖ్య సాధనాంశము. అనివార్య స్వాయంశిక్షణ. ఈ శిక్షణమతమునందు, దేవాలయములమూలమున, కీర్తన, సత్సంగమువలన గలుగును. వీటిని తొలగ ద్రోయసాధ్యములేదు.

ఈ దివ్యసంబంధమును మనము బాగుగా గ్రహించినవెనుక, మనమనస్సులో విచారమువృద్ధి చేయ కుతూహలము వుత్పన్నమై మరిమరి విశేషములను తెలుసుకొన ఆశగలుగుచున్నది. కొద్దికాలమైనవెనుక ఒకప్రమాద సమస్య మనమనస్సులో పుట్టును. "ప్రపంచములో ఇవన్నియు, ఎప్పుడు కలుగ నారంభించెను." సహజమేగదా: సత్సంగవిచారమువలన, మూలాధార సత్య స్వరూప మొకటియే యైనయెడల, నా చుట్టుచూడబడు దృశ్యములు, బహుత్వములుగా ఎట్లుండగలవు. వేదాంతము దానితో నీకు విచారములేదు. పూరుకుండుమని మందలించుటలేదు. బుద్ధి పూర్వక విచారము చేయమని వేదాంతము కోరుచున్నది. ఈ సృష్టియెందుకు కలిగెను? ఎట్లుకలిగెనో తెలుపగలుగుచున్నది.

(సశేషము)

# జాగృతి

కుమారి శిరిపురపు జిజియ



సుమదళాల పరిమళాల
ఘుమాయించు పరిసరాల
కదంద్రొక్కు కనకవల్లి
వెతలెరుగని కల్పవల్లి –
బ్రతుకుదెరువు బరువుమాట
వినబడదా యమ్మవీటి
కష్టసుఖాలన్న వ్రాలు
కననేరని ముద్దరాలు
కడుపులోని క్షుద్బాధను
కథలల్లిన దీన జనుల
వశీకరణమంత్రశక్తి
కతీతమైనదావ్యక్తి

దీనులార
భీరులార
దిక్కులేని
పక్షులార

మీ చక్కని ఘర్మజలం
మీ చిక్కని రక్తకణం
మీ రోడ్చిన శ్రమదానం
మీ రిచ్చిన భ్రమపానం

త్రాగి తూగి మత్తెక్కిన
విర్రవీగి విర్రెత్తిన
మదోన్మత్తులు
మహోన్నతులు
మీమీదే
నీమీదే

మీదికొచ్చి పైకెగసిన
ముందుకొచ్చి పైకుబికిన
విదలించగ శక్తిలేని
అదలించగ యుక్తిలేని
భీరులారా *
దీనులార
ఎత్తిన తల దించకండి

కరుణించిన కర్మఫలం
ప్రసవించిన పుణ్యబలం
అంతే
మీకంతే
మీనుదుటను వ్రాసినట్టి
మీపీటను కురిసినట్టి
తీయనైన
హేయమైన
అమృతధార ! అయ్యలార
ఏడువకండేడువకండి

శ్రమదానం మీవంతు
క్రమదానం మీవంతు
క్షామక్షుభిత మాతృదేశ

క్షేమ క్షోభ మీ కెందుకు?
సిరి గలిగిన
పురిగలిగిన
వాడి తపన మీ కెందుకు?

దీనులైన వీరులారా
వీరులైన దీనులార
రానున్నది
వసుంధరకు
నవవసంత లాలిత్యం!

పోనున్నది
పతితలోక
పీడితజన దారిద్ర్యం!

నిర్భయంగ
నిశ్చలంగ
సాగి పొందు మీ బాటను
చిరునవ్వుల పూలవాన
వర్షించును మీ వీటను

# బిడ్డలు - తల్లిదండ్రులు

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య



(గత సంచిక తరువాయి)

### విధేయతను గూర్చి తల్లి దండ్రుల ఉద్దేశములు

### (Parental Attitudes to obedience).

బిడ్డ చేయవలసినదేదో చెప్పుట సులభమేగాని అది చేయవలెననెడి బుద్ధిని గరపుటెట్లు? శిశు నిర్వహణ మందలి కష్టమంతయు నిక్కడనే యున్నది. దీనికి తోడు బిడ్డ చేయగూడని పనులనే చేయగోరుచుండుట, చేయుమన్నవి చేయ నిరాకరించుచుండుటవలన చాల కష్టములు కలుగుచుండును. కాని ఇవి చాల వరకు మన మనుసరించెడి విధాన ఫలితములే కాగలవు. చెప్పినది చేయరాదనెడి ఉద్దేశము బిడ్డకు లేకున్నను, మనమది చేయుమనెడి రీతినిబట్టి అతడెదురించుటయు, వైరము జూపుటయు జరుగుచుండును. మన మధికారమును జూపరాదని బిడ్డ యనడు. న్యాయముతో నేక రీతిగ జూపెడి యధికారమునకు లోబడియుండుట అతనికిష్టమే, అతడు దానిని గౌరవించును. దానిని గౌరవించి నడచుకొన్నప్పుడే అతనికి భద్రతా భావ ముండి ఆనందము గలుగును. ఒరులు తన బాధ్యత వహింపగలరనెడి భావమతనికెంతో శాంతి నొసగును.

### నిరంకుశాధికారమును జూపెడి తల్లిదండ్రులు

### (Autocratic Parents)

బిడ్డలు తమ యాజ్ఞల మంచి చెడ్డల నాలోచింపక తక్షణమే మన్నింప వలెనని కొందరి తల్లిదండ్రుల యభిప్రాయము. క్రమ శిక్షణయే పనికిరాదని మరి కొందరి వాదన, బిడ్డల నొకప్పుడు విధేయత జూపుడనుచు మరియొకప్పు డూరకొనుచు ఏకరీతి ననుసరించనివారు మరికొందరు. వీరందరిలోను మొదట నుదహరించిన యుద్దేశముగలవారు సాధారణముగ తమ చిన్నతనమున కఠిన శిక్షణ నొందినవారును తల్లిదండ్రుల నెదురించినవారును ఐయుందురు. అట్టివారిప్పుడు తమ బిడ్డలను విధేయత జూపుడని వేధించుట నిజమునకు తమ తల్లిదండ్రులపై నొక విధమగు తెలియని కసి తీర్చుకొనుటయే యగును. ఇంకొక విశేషమేమనిన కఠిన శిక్షణవలననే తామెంతో "సాణ్యమైన" వారైరనియు తమ బిడ్డలను అట్లే పెంచిన వారును తమవలెనే బహు సాణ్యమైనవారగుదురనియు వారనుకొనుచుందురు. బిడ్డలను మంచివారిగ జేయుటకు దండనయే చాల మంచిదనియు, ఇంకను సరిగా చెప్పవలసినచో అదియొక్కటియే మార్గమనియు వీరిలో చాలమంది యభిప్రాయము. ఇది యెంతయు శోచనీయము.

### బిడ్డలపై దీని ఫలితము

### (Effect on Children)

నిరంకుశాధికారులగు తల్లి దండ్రుల యధీనతయందుండి కఠిన దండనల నొందుచు పెరిగిన పిల్లల ప్రవర్తన విశ్వాసనీయము కాజాలదు. అదుపున నున్నప్పుడు వారు సరిగానే యున్నను స్వేచ్ఛను బొందినంతనే అవిధేయత జూపుచు పూర్వము వద్దన్న పనులను జేయుటయేగాక ఇంకను యెన్నో అపకృత్యముల నాచరింపగలరు. చాల మంది బిడ్డలు చిన్న తనము

విధేయత జూపువారే ఐయుండియు పెరిగి పెద్దవారై ఇల్లువదలి పోగలిగినంతనే యిష్టానుసారము చరింప దొడగుదురు.

కఠిన దండనలవలన కొందరు బిడ్డలు భయ స్వభావులగుదురు. అధికారమునకు వెరచుచు, అసమర్థులమని భయపడుచు వారు తమ జీవితములను గడపుదురు. స్వప్రయత్నము, స్వయం సహాయము వారికి ఉండవు. అట్టివారు తమ భయ స్వభావమును బోనడుపుకొని ఆత్మ విశ్వాసము నొందుట చాల యవసరము. దానికి తగురీతిగనే మనము వారికి తోడ్పడవలెను. లేనిచో వారు నిష్ప్రయోజకులుగ తయారగుట తథ్యము.

## క్రమశిక్షణయే యుండరాదనువారు

బిడ్డల నదుపునందుంచి నిర్వహించుట వారి సహజ ప్రవృత్తుల (Natural impulses) నణచుటయే యనియు అందుచేనది మంచిదికాదనియు నూతన మనస్తత్వ శాస్త్రమును జదివిన కొందరు తల్లిదండ్రుల వాదము. అట్టివారు తమబిడ్డలనెట్టి శిక్షణనుంచక విచ్చలవిడి వదలి A. S. Neil మహాశయుని పద్ధతుల ననుసరించితిమని భ్రమపడుచుందురు. కాని మనస్తత్వమును, మానవస్వభావమును బాగుగ నెరిగిన నీల్ మహాశయుడు బిడ్డలనూరక వదలిపెట్టెననుకొనుట వట్టిపొరబాటు. పైకతని పద్ధతులట్లే యగుపడిరినను బిడ్డలమానసిక ఆరోగ్యాభివృద్ధి కనువగు రీతులనెన్నిటినో అతడనుసరించెను. ఇది యేమియు నవగాహనజేసికొనక బిడ్డల నిష్టరీతుల చరింపనిచ్చుటచే వారు స్వార్థపరులై ఎదురించుటనలవరచు కొందరు. ఇంటిలో నశాంతి ప్రబలును. కొందరు తల్లిదండ్రులకిది సంతృప్తికరమేమోగాని చాలమందికి బాధాకరమగును. ఏమిచేయుటకును తోచక వారలజడి పడుదురు. బిడ్డలనదుపున నే యుంచరాదనెడి వాదమున కర్థములేదు. వారువిషముద్రాగుటకు మన మొప్పుకొందుమా? వారిని నిప్పులోబడనిత్తుమా? నిగ్రహమే వద్దను తలిదండ్రులు, బిడ్డలు తమ మానసికారోగ్యమునకు ఇంతటిహానికరములగు పనులను జేయుచున్నను, ఏమియుననక యూరకుందురు.

ఒక దినమున నేనొక స్నేహితురాలిని చూడ బోయితిని. మేమిరువురము గదిలో గూర్చుండి మాట్లాడుచుండగా ఆమెకొడుకు, మూడేండ్లవాడు, లోనికివచ్చి సోఫాపై మొగ్గలువేయ నారంభించెను. అంత నామె యాతనిజూచి "డేవిడ్ తోటలోనో, నర్సరీలోనో మొగ్గలు వేసుకొనవచ్చును. మేమిట ప్రశాంతముగ మాట్లాడుకొనవలెను." అని నెమ్మదిగా జెప్పెను. డేవిడ్ అచటనుండి బయటకుబోయి మరి కొంత సేపటికి తిరిగివచ్చెను. ఆమెయు పూర్వము జెప్పినట్లే మరల జెప్పెను. బిడ్డ మొదటి రెండు పర్యాయములు మొగ్గలు వేయ ప్రయత్నించెను. మూడవమారు సద్దుచేయక తల్లికడనొక నిముసముండి వెడలిపోయెను. నా స్నేహితురాలికి పది నెలలు యాడుబిడ్డగూడ నుండెను. ఆమె యాబిడ్డ సిగరెట్టు బూడిద నదలించుకొను తబుకును తాక ప్రయత్నించుట జూచి "వద్దు జూడిల్ వద్దని" నెమ్మదిగాను, నిశ్చయముగాను పలికెను. జూడిల్ చేతినప్పటికి వెనుకకు తీసికొని మరికొంతసేపైన పిదప తిరిగి ముట్టప్రయత్నించెను. తల్లి తిరిగి వద్దనెను. అంత నా బిడ్డ తన తల్లి నిజముగా ఉద్దేశపూర్వకముగ, పలికెనో లేదో తెలిసికొనుటకు ఆమె వంకజూచెను. ఆమె వద్దని మరల నిశ్చయముగా పలికెను. బిడ్డ యటనుండి ప్రాకిపోయెను. పిదప నా స్నేహితురాలు, "నేననుసరించునది నిర్బంధ విధానమని (Repressive method) నామిత్రులనుచుందురు. అది నిజమా?" యని నన్నడిగెను. అది నిజముకాదనియు, ఆమె విధానము సరియైనదేయనియు నే నామెకు సమాధానమిచ్చితిని.

డేవిడ్ మూడేండ్లవాడగుటచే తల్లి గదిలో యేల యాడవలదనెనో యర్థముజేసికొనెను, ఆమె శాంతముగను సకారణముగను మాటలాడుటచే అతనికి న్యాయగుణమలవడగలదు. ప్రాకెడు శిశువు జూడిత్తునకు కారణములు జెప్పిన అర్థముకావు. కాని ఆ బిడ్డయు మనవలెనే చేయరాని వేవో తెలి

సికొనవలెను. తల్లి వద్దని, కసరక, ప్రశాంతముగను నిశ్చయముగను జెప్పుటచే ఆమె పట్టుబట్టక నెమ్మదిగా నదిగ్రహించి సద్దుకొనగలిగెను. ఇకకొంత కాలమున కామెయు పెద్దదై చెప్పినదర్థము జేసికొనగలదు. అప్పుడు తల్లి తానేదైనను చేయుమన్నను వద్దన్నను ఎందులకో ఆ బిడ్డకును చెప్పగలదు.

బిడ్డల నెట్టియదుపున నుంచక ఇష్టానుసారముండ నిచ్చిన ఎక్కువ యానందము నొందుదురనుకొనుట పొరబాటు. వారినికి వారి మానసిక ప్రవృత్తులపై స్వాధీనము చాల తక్కువ. అవి యెటు లాగిన అటు బోవుచు ఏమిచేయుటకును తోచక ఎంతో బాధపడగలరు. అట్టి వారిని అదుపునుంచి నడపుట అవసరమగును. బిడ్డలానందముగనుండుటకు స్వేచ్ఛ నొసగుట ఎంతముఖ్యమో సరియగు నిగ్రహమున నుంచుటయు అంతే ముఖ్యము.

# పుష్పోత్సవము — చోటానాగపూర్

శ్రీ ఆకుండి వెంకట శాస్త్రి



ప్రాచీనకాలమున మన దేశమున సాల ('మద్ది') వృక్షమునకు పుష్పోత్సవము చేయబడుచుండెను. హిందూదేశమున తూర్పు తీర ప్రాంతములవారిచే చేయబడుచుండిన పుష్పోత్సవము క్రమముగ రూపుమాసి పోయెను. చోటానాగపుర ప్రాంతమున నిప్పటికిని ముండాలను ఆటవికజాతి వారు చేయుచున్నారు. ఒకానొక కాలమున హిందూదేశమున తూర్పు తీర ప్రాంతములందలి యీ సాలవృక్షము విరియపూచెడుకాలమున యీ పుష్పోత్సవమును చేయుచుండెడివారు. బౌద్ధ, సంస్కృత వాఙ్మయములలో సాలవృక్షములతోటలలోను సాలవృక్షములు పుష్పించుకాలమున సాలవృక్షములక్రింద చేయబడు యీ పుష్పసంబంధమైన ఉత్సవమును గూర్చి ప్రసక్తి కలదు. విరియపూసిన సాలవృక్షపు మ్రానునుగాని, కొమ్మలనుగాని స్త్రీలు ఆలింగనము చేయునాచారమును వర్ణించుచు పద్యకావ్యాదులలోను, కథలలోను శిల్పములలోను కనపడుచున్నది. ఆయాచారము స్త్రీలకు కామోద్రేకముకల్గించునదిగనుండెనని పేర్కొనబడెను. 'లంబినీ'యను స్థలమునగల సాలవృక్షములుగల ఆరామమునందే మాయాదేవి బుద్ధుని ప్రసవించెను.

ఒకనాడు మాయాదేవి గర్భిణిగానున్నప్పుడా సాలారామము ప్రక్కనుండి గుఱ్ఱపుబండిపై విహారమునకు పోవుచు విరుగఁబూచిన సాలవృక్షములను జూచి పూలతోనున్న కొమ్మనొకదానిని విరచి తీసికొనిపోవ కోర్కెగల్గెనట. వెంటనే ఆమెకు ప్రసవవేదానలారంభమైయ్యెనట. ఆమె నావనములోనికి గొనిపోయి వట కుటీరము సేవకులచే యేర్పరుపబడెననియు, అచ్చటనే ఆమె బుద్ధుని కనెనని యొకకథకలదు. బౌద్ధ వాఙ్మయములో 'సాలభంజిక' అను ఉత్సవము శ్రావస్థి నగరమున బుద్ధుడచటనున్నప్పుడు జరుపబడెనని పేర్కొనబడెను. ఈ 'సాలభంజిక' ఉత్సవమును స్త్రీజనముచేతనే జరుపబడుననియు, వారి యుత్సవములో సాలపుష్పములను స్త్రీలు కోయుట, ఆ సాలవృక్షములకు స్త్రీలు నీరుపోయుట యనునవియే ముఖ్యములు. ఈయుత్సవమును జరుపు నాచారము హిందూదేశపు తూర్పు తీర ప్రాంతములలో రూపుమాసి పోయినను యిప్పటికిని చోటానాగపూర్‌లో సుస్థిర

ముగ నెలకొనియున్నది. కాని యిప్పటికి కొన్ని చోట్ల శిల్పములలో యీ పుష్పోత్సవ చిహ్నములు కనపడుచున్నవి. భార్హూత్ అను చోటగాని మధుర అను చోటగాని స్త్రీలు పుష్పించిన సాలవృక్షపు కొమ్మను గాని ప్రమానునుగాని ఆలింగనము చేసి కొన్నట్లు యీ శిల్పములో స్త్రీమూర్తులనే శిల్పులు చిత్రించిరి. బౌద్ధ శిల్పములలో రాతి స్తంభములపైన యిట్టి స్త్రీల మూర్తులు కన్పడుచుండును.

సాంచిస్తూపమునఉత్తరపు తోరణము కడను, మధురలోని స్తంభముల మీదను యిట్టి సాలభంజికలుకలవని 'ఓగెల్' అను నొక పురావస్తు పరిశోధకుడు తెలిపెను. జర్మనీ దేశములో 'బెర్లిన్' నగరమందలి 'మ్యూజియమ్'లో గ్రీకు - బౌద్ధ సంప్రదాయపు శిల్పఖండమొకటికలదనివ్రాసెను. కాలక్రమమున సంస్కృత వాఙ్మయమున 'సాలభంజిక' అనగా స్తంభముపై చెక్కబడిన స్త్రీమూర్తియని పేర్కొనబడెను.

బుద్ధగయలోగల నొక దేవళములో నొక వింతయైన శిల్ప చిత్రముకలదు. అది యొక రాతిస్తంభముపై 'సాలభంజిక'ను చిత్రించునది. 1871 సంవత్సరమున 'కన్నింగ్ హామ్' అను పేరుగల పురావస్తు పరిశోధకుడు బుద్ధగయలోని దేవళములోని సాలభంజికగల రాతిస్తంభమును త్రవ్వించి చూడగా భూమిలోకప్పబడియుండిన స్తంభభాగమున నొక స్త్రీ సాలవృక్షపు ప్రమానునంటి పెట్టుకొని యున్నట్లును, ఆమె కుడి పాదమును చేతులలో భరించుచున్న పురుషవిగ్రహమును, కానబడెనట. భర్హూత్ లోగల బౌద్ధ విగ్రహములతో పోల్చి చూడగా బుద్ధగయ దేవళములోగల 'సాలభంజిక'లోనున్న స్త్రీ మూర్తి యక్షిణిస్త్రీరూపమని కన్నింగ్ హామ్ నిర్ణయించెను. ఈ శిల్పము సంగవంశపు రాజులకాలమునాటిదని 'ఓగెల్' నిర్ణయించెను. ఈ స్తంభము అశోకుని కాలపు అలంకారరూపమగు శిల్పచిత్రశోభితమగు స్థంభమనియు దీనికి ప్రాచీనభారత దేశమున పుష్పోత్సవములచేయు నాచారమును జ్ఞప్తికి దెచ్చుచున్నదని 'ఓగెల్' అభిప్రాయము. సాల వృక్షములు పుష్పించుకాలమున పుష్పోత్సవములచేయు సాచారము ముండాలను నాటవికమానవజాతివారి జాతీయ జీవితములో ముఖ్యమైన యాచారముగ కన్పడుచున్నది. సాలవృక్షములు ఆకులను రాల్చి, చిగిర్చి, పుష్పించుకాలమున ముండా జాతివారు 'బా - పరాబ్' (పూలయుత్సవము లేక పంగ) చేయుదురు. మే, జూన్ నెలలలో సాలవృక్షములు చిగిర్చి పుష్పించు ఋతువునందు వందలకొలది ముండాజాతి స్త్రీలు యీ సాలవృక్షశాఖలనుగాని, ప్రమానులనుగాని ప్రేమాలింగనము గావించుకొందురు.

ఇట్లు రాత్రిపై మలచబడిన స్త్రీ మూర్తులే 'సాల భంజిక'లని ప్రసిద్ధినిపడసినవి. చోటా నాగపూర్ ప్రాంతముల ముండా జాతి స్త్రీలెల్లరు సాల పుష్పములతో తమ శిరస్సులనలంకరించుకొందురు. తమ యిండ్లకువచ్చిన స్త్రీలకెల్లరకు సాలపుష్పములను, సాలవృక్షపు పూచిన కొమ్మలను పంచియిచ్చి గౌరవింతురు.

పుష్పోత్సవములలో సంగీతము, నృత్యము ప్రాధాన్యము వహించును. యువకులు, యువతులు యీ పుష్పోత్సవ సంగీతనృత్య కార్య కలాపములయందు పాల్గొనుచు, సాల పుష్పములతో నొకరి నొకరు విలాసముగ కొట్టుకొందురు.

ఈ విధముగా 'బా - పరాబ్' పుష్పోత్సవములు ముగియును. ఈ పుష్పోత్సవములు ముగియువరకు సాల వృక్షపు ఆకులను, వారి యిండ్లలో నెందులకును యుపయోగింపరు. ప్రతి దేశములోను, నాగరీక, అనాగరకజాతుల వారెల్లరచే, స్త్రీ బాలవృద్ధులవరకు పుష్పములు వివాహాది శుభకార్యములలోను, దేవపూజాదికములందును, ఉత్సవములలోను మంగళప్రదములైనవిగా భావింపఁబడుచున్నవి. ప్రపంచములో నన్ని దేశములలోను, పుష్పములు నేత్ర మనోరంజకములై మానవ జాతికి ఉపయోగకరములై మాననీయములగుచున్నవి. ఈ విషయమున ప్రపంచమంతట 'ఏకత్వము' విస్పష్టముగ గోచరమగుచున్నది.

(పి. సి. రాయి చౌదరీగారి ఆంగ్లవ్యాసానువాదము)

---

## "కుమారి"

శ్రీ మరువాడ సూర్యప్రకాశం

—:o:—

అడిగిన కోరిక దీర్చని
నడిగాలపుమగని గొల్చి నలుగుట కంటెన్.
బడిలో పాఠము జెప్పుచు
పొడి జీతముతోడ పొట్టగడుపు కుమారీ!

అడిగిన కోరిక దీర్చిన
ముదుగాళ్ళను ముసలి గొల్చి మూల్గుటకంటెన్.
ఎడబాటులేని ప్రేమతో
నడిగాలపు మగడు నీకు నయముకుమారీ!

విత్తముగల దినములలో
చిత్తము! చిత్తంబటంచు దిరుగుదురెల్లన్
విత్తము వీడినయంతనె
బత్తెము లేదంచు బరిహాసింత్రు కుమారీ!

# అంకెలూ - సంఖ్యలూ

శ్రీ శ్రొవ్విడి అన్నంరాజుశర్మ

సభికులందరూ ఆసీనులైవున్నహాల్లో ఎత్తుగానున్న గోడగడియారంలో అయిదు గంటల పదినిమిషాలైంది. చల్లని మనోహరమైన సాయంత్రం. అంత వరకూ సందడిగానూ, కోలాహలంగానూ వున్న హాలు ఆవరణంతా అదే సమయానికి నిశ్శబ్దాన్నవలంబించింది. కళాకాంతులు ముఖంలో వుట్టిపడుతూన్న వృద్ధుడొకడు లేచినిలబడి గొంతు సవరించుకున్నాడు.

"ఈనాడు చాలా పర్వదినం. సంఘసంస్కరణాభిలాషపరులు, జగమెరిగిన బ్రాహ్మణులు, వితంతు వివాహాలపై స్వచ్ఛమైన అభిప్రాయాలు కలిగి, సమాజంలోని వొడుదుడుకుల్ని తీవ్రంగా నిరశిస్తూ నిజకర్తవ్యంఎరిగి ముందంజవేస్తూన్న రాజశేఖరరావుగారు - లోకం ఆయన్ని రాజయ్యగారని పిలుస్తుంది - రాజయ్యగారు ... వారి షష్టిపూర్తి మహోత్సవానికి నేను అధ్యక్షపదవి నలంకరించవలసి వచ్చినందుకు యీ మహోత్సవం మా భవనంలో జరగడం సంభవించినందుకు నేను గర్విస్తున్నాను. రాజయ్యగారు నిష్కల్మషమైన, స్వచ్ఛందమైన దేశసేవాపరాయణులు. వారి సముఖంలో వారిని పొగిడి సిగ్గిల చేస్తూన్నందుకు క్షంతవ్యుడ్ని. వారి వుదార స్వభావాన్ని, సరస సద్గుణ సంపన్నతనూ ఎరుగనివారు అరుదు. ఏమారుమూల దేశంలో అయినా సరే, ఎంతదూర ప్రాంతం అయినా సరే ఏవ్యక్తిగానీ అనాథగా, అసహాయగా ఆర్తనాదం గావించిందంటే వారి కోమల హృదయం సంక్షుభితమై కన్నీరు విడుస్తుంది. అట్టి సమయంలో వారి అపార దయారసం కట్టలుతెగి, పరిధులుదాటి ప్రవహిస్తుంది. బంధు సంబంధంగా వారు ఏకాకి. కాని మిత్రసంబంధంగా అందరూ అందుకోగల దగ్గర వస్తువు. ఈ మధ్యలో వెలసిన ఏ అనాథ, వితంతు శరణాలయాలు వారి సహృదయం సమర్పించి అఖండ విరాళాలతో ఉక్కిరి బిక్కిరి కాకుండాపోలేదు. ఆయన సహాయం బడసిన అనేకులు, జీవితమంతా అంధకార బంధురమని భావించి నిరాశాపరులై తిరిగి వారి కటాక్ష వీక్షణంపైబడి, 'జీవితం ఆత్మహత్యకు కాదు, ఆత్మ పరీక్షకు' అని నిరూపించుకున్న ఆ నాటి అభాగినులు, వారిచే పోషింపబడుతూవున్న శరణాలయాలలోని యువతులు వందలకు వందలు నేడిక్కడ సమావేశం కావటం నా కన్నుల పండువుగావుంది. అదిగో కమల! రాజయ్యగారి ప్రాణం, వారి పెంపుడు కుమార్తె. వారి అపూర్వకరుణామయమైన మనస్సు విరజిమ్మే లాలిత్యంభరించలేక కన్నీరు విడుస్తోంది. ఈ అమోఘమైన సంఘటన చాలదా ఎవరిగుండెనైనా ద్రవింపచేయటానికి? ఇంక నేనేమని చెప్పను? వారిని ఏదయినా పొగిడి చికాకుపరిచినట్లయితే మళ్ళీ ఓసారి క్షమించమని ప్రార్థిస్తూ, యింతకంటే పొడిగించటానికి గద్గదమైవున్న నాకంఠం పనికిరావటంలేదని విన్నవించుకుంటూ నా మాటల్లో ఏదయినా అపచారంచేసినట్లయితే యీ అపరాధాన్ని మన్నించమని వేడుకుంటూ యింతటితో విరమిస్తున్నాను."

కరతాళ ధ్వనులు చెలరేగాయి. అందులో ఎక్కువభాగం అబలల ఆక్రందనలకు మారుపేరైన-నవనీత మనస్కులు చేసిన శబ్దసముదాయాలు.

వృద్ధుడు కూర్చున్నాడు. సభాస్థితి తిరిగి నిశ్శబ్దం వహించింది. కొన్నివందలమంది సుఖంగా ఆసీనులు కాగలిగిన విశాలమైన హాలు అది. ఇటువంటి ఉజ్వలమైన ప్రయోజనాలకోసమే నిర్మించబడినదా అని భ్రమకలిగిస్తోంది. రాజయ్యగారు తలవంచుకుని వినయ విధేయతలతో కూర్చున్నాడు. ఒకసారి

తలఎత్తి అందరి ముఖాలవంకా ప్రశాంతమైన చిరునవ్వు వెలుగుతున్న వదనంతో వీక్షించాడు. సర్వత్రా నిశ్శబ్దం తాండవిస్తోంది. బాధలు, కష్టాలు స్ఫుటంగా, ముఖాలలో ముద్రితమైవున్న మహిళలందరూ ఒక్కుమ్మడి వేదనతో నిట్టూర్పు విడిచినట్లు, లేక ఆ శబ్దాన్ని మరుగుపరుస్తూనో అందమైన గోడమీద గడియారం అరగంట కొట్టింది. సుదూరంలో కూర్చుని తండ్రిగారివంక అత్యంత శ్రద్ధాభక్తులతో తిలకిస్తూన్న కమల చప్పున విచలిత హృదయురాలైంది. ఆ వేదనా భరితమైన కమల కోమల హృదయం తిరిగి ఒకింత చలించి, అది ఆర్ద్రతను వారించుమని ఏదో కన్నీరుగా నేత్రాలనుంచి బయటకు పాయలుగా స్రవిస్తూన్న అనురాగరసాన్ని తుడుచుకోవటానికి లజ్జితురాలై, గంభీరతను నింపుకుని తండ్రిచేసిన మందహాసం గుండెను కెలికినట్లుకాగా పూర్తిగా బాహ్యస్మృతిలోకి ప్రవేశించి తన తప్పును తెలుసుకుని చేతిరుమాలతో వాటిని మెల్లమెల్లగా తుడిచివేసింది. ఇది యిప్పుడు కలకాదు; నిజంఅన్న సంగతి గుర్తించింది. అధ్యక్షుడు తనని గురించి పలికిన పలుకులు యదార్థానికి సంబంధించినవేకాక, తనలో సిగ్గుమాలినతనం రేకెత్తించబడిన విషయం విస్మరింపచేశాయి. ఇంత సానుభూతి భరించటం ఎంత కష్టమో. ఇప్పుడు విన్నదాంట్లో అతిశయోక్తి ఏమీలేదు. "నాన్నా"! అని మనసారా అభివందనంచేయాలని సంకల్పించిన మనసు చేసిన వొత్తిడికి తట్టుకోలేక "అయ్యో!" అని నిట్టూర్చి, కొద్దిగా జరిగి, దిటవుచేసుకుని కూర్చుని ఆయనవంక సాభిప్రాయంగా చూసింది.

అధ్యక్షుడు లేచినిల్చున్నాడు. మధురమైన తన కంఠం సవరించుకుని యిలా అన్నాడు. "రాజయ్యగారిని మాట్లాడమని కోరుతున్నాను!"

రాజయ్యగారు నిశ్శబ్దంగా లేచినిలబడ్డాడు. ఒకసారి నలువంకలా పరికించాడు. తృప్తితో ఆయన నేత్రాలు ప్రకాశించినవి. మెల్లగా పెదాలు కదిలాయి.

"మిత్రులారా!" అని సంభోదించాడు. గొంతు వొణికింది. సభయావత్తూ కంపించినట్లయింది. నిర్మలతలో ఎంతటి నిగూఢమైన శక్తివుంది!

"ఇవాళ ఎంత సుదినం! నాకు షష్టి పూర్తి మహోత్సవం జరుగుతున్నందుకు కాదు. అసలు అది ముఖ్యమైన సంగతి కానేకాదు. ఇదిగో! ఈ తెరలచాటున అమర్చివున్న చిత్ర పటం వంక తిలకించారా! ఇది నాదేనని మీరు అనుకుంటున్నారుకదూ! కాదు. ఈ నాడు జరగవలసిన కార్యక్రమంలో ముఖ్య ఘట్టం నాకు సంబంధించినది కాదు. ముందు ... ఒకమాట చెబుతున్నా—ఆలకించండి. అధ్యక్ష మహాశయులు నన్ను కరుణామయునిగా, ఉదార స్వభావునిగా కీర్తించారు. ఇప్పటి నా నిజరూపం నాకు తెలియదని విన్నవించుకుంటున్నాను. పదిసంవత్సరాలక్రితం యీ వూళ్లోనే రాజశేఖరం అంటూ ఒక వ్యక్తి వుండేవాడు. వాడు పాషాణుడు, రాక్షసుడు, క్రూరుడు, దుర్మార్గుడు. అట్టి మనిషిని మీరందరూ యిప్పుడనుకుంటున్న విధంగా తయారుచేసినదెవరో తెలుసునా? అధ్యక్ష మహాశయుల్ని యీ చిత్రపటం ఆవిష్కరించవలసినదిగా కోరుకుంటున్నాను."

అధ్యక్షుడు ఏదోచెప్పి వారించబోయాడు. కాని సన్మానితుడు విన్పించుకునే స్థితిలో లేడు. ఒక క్షణం సభలో కలవరంబయల్దేరింది. అధ్యక్షుడు లేచి పటాన్ని సమీపిస్తున్నాడు. గొడవఅంతా చప్పున మాటుమణిగింది. ప్రతి వ్యక్తీ ఊపిరి బిగించి, రెప్పవాల్చక చూస్తున్నాడు. చూస్తున్న చిత్రపటం ఆవిష్కరించబడింది.

"ఉత్తమ యిల్లాలు, మహాసాధ్వి. ఈమె గుణగణాలను కీర్తించే అర్హత నాకులేదు. ఈమె నా తనయ"

సభలో చిన్న కోలాహలం జనించి, మళ్ళీ వెంటనే అంతరించిపోయింది.

"బహుశా మీలో చాలామంది ఎరిగివుండక

పోవచ్చు. ఏనాడూ యింటివాకిలిదాటి, బయటి ప్రపంచంచూసి ఎరుగని ఆమె నైజగుణమే అందుకు కారణం అని చెప్పటానికి నేను ... గ ... గర్విస్తున్నాను. దౌర్భాగ్యుడినై విలపిస్తున్నాను. తల్లీ కమల! ఆమె నీ అక్క, అలా చూడు ఆ పవిత్ర మూర్తిని."

ఆశ్చర్యంతోనూ, దుఃఖంతోనూ కమల చకితురాలైంది. చిత్రంలోని అమాయక సుందరరూపం వంక తదేకంగా చూడసాగింది. జాలితో కన్నీళ్ళు జారాయి.

"అప్పుడామె పద్ధెనిమిది సంవత్సరాల, పసిడి నిగ్గులు తేలి యవ్వనంలోవున్న యువతి. ఇది పది సంవత్సరాలకి పూర్వం జరిగిన సంఘటన. జాగ్రత్తగా ఆలకిస్తే నా దైన్యానికి కారణం విపులీకరించ గలుగుతాను. ఆమె పేరు అరవింద. అరవింద నా కుమార్తె. తల్లిలేనిపిల్ల అయింది బాల్యంలోనే. నా భార్య యీ చిట్టితల్లిని నా చేతుల్లోపెట్టి శలవు తీసుకుంది. నా ప్రాణానికి ప్రాణంగా అరవిందను పెంచలేకపోయిన పాపిష్టిని. దాసీలే, అడపా తడపా మా యింటికి వచ్చే బంధువులే పెంచి పెద్దదాన్ని చేశారు. ఆమెలోని అమాయకత్వం చిందించే వెన్నెలను తండ్రిఅయికూడా అనుభవించలేని మనిషిని మృగం అని పిలవాలి. ఆమె అలాగే తలిదండ్రుల ప్రేమ లోపించి పెరుగుతూంటే_నేనో_? విచ్చలవిడిగా నా దారిన తిరుగుతూండేవాడిని. నా డబ్బును ఆనందంగా మార్చుకున్నాను. బంధువుల బలవంతం వల్ల అరవింద పధ్నాలుగో ఏట ఏదో పెళ్ళి అయిందనిపించాను. కాపురానికి వెళ్ళిపోయింది కొద్దిరోజుల్లోనే. నా గుండె ఎంత కఠినమైనదో మీరు దీనినిబట్టే ఊహించుకోవచ్చు. అత్తవారింటికి వెళ్ళిపోయాక ఆమె వర్తమానం ఏమీ తెలుసుకోవటానికి నేను అల్పప్రయత్నంకూడా చేయలేదు. పుట్టి, బుద్ధెరిగాక నా వద్దకువచ్చి "నాన్నా! నాకు అది కావాలి, యిది కావాలి" అని గారాబంచేసి ఎరుగదు కదా - ఎప్పుడన్నా నేనున్న గదిలోకి అడుగు పెడితేనే "పో అవతలకు" అని కసురుకునేవాడిని. అటువంటి నా దగ్గరకు తనంతట రా ఏ కుమార్తె సాహసిస్తుంది? అప్పుడు బంధువులు కొంతమంది నా దగ్గరకువచ్చి అరవిందను ఆమె పెనిమిటి చాలా కష్టాలపాలు చేస్తున్నాడనీ, చిత్రహింస సాగిస్తున్నాడనీ, అతిడు వట్టి మూర్ఖుడనీ చెప్పేవాళ్ళు. నేను నిర్లక్ష్యంతో వినీ విననట్లు ఊరుకునేవాడిని. ఇలా రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. బంధువులు వచ్చి అల్లుడి విషయం తేల్చుకొమ్మని ఎన్నిసార్లో బోధించటం జరిగింది. నేనేమీ లెక్కచెయ్యలేదు. అరవింద లేకలేక పుట్టినపిల్ల అన్న జ్ఞానంకూడా నాకు లేకపోయింది."

"ఓ, రోజు ఉదయం అప్పుడే నిద్రలేచాను. అంతవరకూ నాకు నిద్రాభంగంచేయడానికి వెరుస్తూ, సమీపంలో తారట్లాడుతున్న నౌఖర్లు పరిగెత్తుకువచ్చి అమ్మాయిగారు వచ్చారని చెప్పారు. నేను విస్తుపోయి "అమ్మాయిగారెవర్రా?" అనడిగాను. "అరవిందమ్మగారండి?" ఓహో! నా కూతురు వుందన్నమాట. అని మందమతితనమా? అహంభావమా? ... అమ్మాయిని సమీపించాను. ఒకమూల దీనవదనంతో నిలబడివుంది. పుట్టెడు దుఃఖంతో నా వంక చూసింది. పుట్టాక ఆమె కళ్ళు అంత ఎర్రబడివుండటము చూడలేదు. అయినప్పటికీ నాకేమీ బాధ అనుపించలేదు. "ఏం?" అన్నాను మోటుగా. 'నాన్నా!' అంది గాద్గదిక కంఠంతో. ఇదేమిటి? నన్ను 'నాన్నా!' అని పిలిచేవారుకూడా వున్నారా ఏమిటి? "వారు పోయారు నాన్నా!" అని బావురుమంటూ నేల మీద వాలిపోయింది. "అయ్యో పాపం" అనుకున్నాను. 'ఈమె నా కూతురు-దగ్గరకు తీసుకుని లాలించాలి, బుజ్జగించాలి' అని నాకేం తెలియదు. 'ఏం జబ్బు?' అనడిగాను అలా మొద్దులా నిలబడి చూస్తూ. ఏడుస్తూ అలానే పడుకునివుంది. నాకు జాలికలిగింది. "సరే, జరిగిందేదో జరిగింది. ఏం చేస్తాం? ఇక్కడ నీకు వచ్చినలోటు ఏమీ లేదు లోపలికిపద. ముఖం కడుక్కొని కాఫీత్రాగు" అ

అక్కడినుంచి కదలి లోపలకు వెళ్ళాను. నాకు వరుసకు చెల్లెలు, అమంగళి అయిన ఒకామె మా యింట్లోనే తింటూవుంటుంది. వెళ్ళి వ్యవహారం చూడమని ఆమెను సాగనంపి నేను నా పనుల్లో నిమగ్నుడైపోయాను.”

రాజయ్యగారు ఓ క్షణం ఆగి తడబడుతున్న చూపుల్తో చుట్టూరా ఓ సారి కలయజూశాడు. కొన్నివందల కళ్ళు సాభిప్రాయంగా ఆయన్ని పరికిస్తున్నాయి. శ్రద్ధాభక్తులతో ఆలకిస్తున్నారు అది కథ కాదు ఉపన్యాసం అని మరిచి. నెమ్మదిగా కొనసాగించాడు.

“ఇలా రోజులు, వారాలు, నెలలు ఒకటి ... రెండు సంవత్సరాలు గడిచిపోతున్నాయి. నా కార్యక్రమానికేమీ అడ్డులేదు. భర్తను కోల్పోయి వచ్చి, అహర్నిశాలూ దిగులుతో కుమిలిపోతూన్న కూతురు యింట్లోవున్నదన్న సంగతి నా విస్మృతిలో పడిపోయింది. ఇదివరకు ఆమె మంచీ చెడూ నేను పట్టించుకోలేదు. ఇప్పుడూ అంతే. వారానికీ పది రోజులకూ ఓ సారి నా కళ్ళబడేదేమో. ఏ సమయంలో ఏంచేస్తోందో, ఏ మూలవుంటుందోకూడా నాకేం తెలియదు. ఇదివరకు యిక్కడ వుండగా ఎప్పుడోగాని వాకిట్లోకి వెళ్ళి ఎరుగదు. ఇప్పుడూ అంతే. అప్పుడప్పుడూ నా వరుస చెల్లెలు నా దగ్గరకువచ్చి ఏమేమో మొత్తుకునేది. ‘అరవింద అన్నెమూ, పున్నెమూ ఎరుగని అమాయకురాలనీ, ఆ పెళ్ళిచేసేముందు వాడంటే ఆమెకు యిష్టంవుందో లేదో నేనసలు కనుక్కోలేదని, ఆ దౌర్భాగ్యుడితో కాపురంచేసినన్నాళ్లూ కష్టంతప్ప సుఖం అన్నది ఎరుగదనీ’ కొంచం ఆగి చాలా అవస్థపడి, ఎంతో తటపటాయించి, చివరకు తెగించి “ఈ రోజుల్లో మళ్ళీ పెళ్ళిచేయటం ఏమితప్పు? ఎందరెందరు చేసుకోవటంల్లేదు?”

‘గంగమ్మా’ అని అరిచాను వళ్ళు తెలియని కోపంతో. ‘ఇంత పెద్దదానవు. లోకం తెలిసినదానవు. ఈ సలహా చెప్పటానికి నీకు సిగ్గు ఎలా లేకపోయిందమ్మా!’

“సిగ్గు ఎందుకు అన్నయ్యా? నాకీ వికారరూపం కలిగించి, అన్నిటికీ దూరంచేసి, చిన్నవయస్సులోనే సిగ్గుఅన్నది విస్మరింపజేశారుకదా మీరంతా. నాలాంటి ఆడదాని నోటంట ఆవేదనా పూరితంగా వెలువడినమాట నీ లోనే జాలికలిగించటములేదా?” అంది.

“‘జాలి’ అని చీదరించుకున్నాను. నీతి, పరువు వీటికన్నా గొప్పదైన అంశమా-ఏం జాలి? ఆ బురఖాను తొడగబోకు.”

“‘ఓహో’ అని తలపరికించి ఆ నీతీ నియమాలు నాకూ తెలుసు. కాని నీ నీతేం చట్టబండలైందీ? యాభయ్యో పడి సమీపించింది.”

నేను క్రోధావిష్టుడనైనాను. తీక్ష్ణంగా వీక్షించాను “ఏదిక్కూ లేక యీ యింట్లో చేరావన్న విషయం గుర్తుంచుకో. ఇహ యీ దిక్కుకుకూడా నీళ్ళు వదులుకో తలచకపోతే మరి ఒక్క దుర్భాష అయినా రానీయకు.”

అంతే. ఆమె ఏమీమాట్లాడలేక పోయింది. ఏడుస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

(సశేషము)

# అమలాపురం - కోనసీమ మహిళా సంఘము



అమలాపురం - కోనసీమ మహిళాసంఘపు వార్షికోత్సవము యీ నెల 2,3 తేదీలలో రాజమండ్రి మునిసిపల్ కౌన్సిలర్ శ్రీమతి అడ్డేపల్లి వివేకానందాదేవి బి. ఎ. అధ్యక్షతన వైభవముగాజరిగెను. సంఘాధ్యక్షురాలు శ్రీమతి గోటేటి సరస్వతి సభికులకు స్వాగతము చెప్పిరి.

అధ్యక్షోపన్యాసములో శ్రీమతి వివేకానందాదేవి మహిళాసంఘకార్యకలాపములపట్ల సంతోషమును వెలిబుచ్చుచు మహిళల విద్యాభ్యాసం డిగ్రీల సంపాదనతో పరిమితంకాక ఆదర్శగృహిణులుగా కుటుంబ నిర్వహణకు సంబంధించిన విజ్ఞానము నార్జించి, ప్రపంచములో సుస్థిరమైన శాంతి సౌభాగ్యములు ఏర్పడుటకు కృషిచేయుటకనువైనదిగా నుండవలెననియు, శాంతి, స్వాతంత్ర్య బీజముల నుగ్గుపాలతోనే బాలలకు నాటవలెననియు, మహిళాభ్యున్నతి ఆంధ్రదేశములో బహుళొద్దిగా నుండుటచే మహిళాసంఘాల నిర్మాణం విరివిగా జరిగి కార్యక్రమం అచంచల దీక్షతో సాగాలని ఉద్బోధించిరి.

కార్యదర్శిని శ్రీమతి జి. ఆర్. కె. లక్ష్మి నివేదికనుచదివిరి. శ్రీమతులు కందా భాస్కరమ్మ, పి. సీతామణి, డాక్టరు సరస్వతిగారలుపన్యసించిరి. శ్రీమతులు వంకాయలు సీత, నాగామణిగార్ల వీణ, శ్రీమతి కే. సుబ్బలక్ష్మిగారి గాత్ర కచ్చేరీలతోటి, మహిళా నాట్యమండలివారి 'లవకుశ' నాటకపదర్శనముతోటి మొదటి రోజు కార్యక్రమము ముగిసెను.

రెండవరోజున సంగీతము, హిందీ, చేతి పనులు నేర్పుటకు ఏర్పాట్లుచేయుటకును, సంఘపు భవనమునకుగాను త్వరలోస్థలమును సేకరించుటకు తీర్మానములు చేసిరి. శ్రీమతులు పున్నమరాజుసీత, కమలగార్ల గానకచ్చేరి, బాలికలచే భరత నాట్యము, కుమారి శ్యామలచే నృత్యప్రదర్శనము, మహిళానాట్యమండలివారి 'శ్రీమతులు, శ్రీమంతులు' నాటకప్రదర్శనము జరిగినవి. వినోదప్రదర్శనములలో పాల్గొనినవారికి శ్రీమతి సీతామణిగారు బహుమతులను పంచిపెట్టిరి.

శ్రీమతి గోటేటి సరస్వతిగారు వందనసమర్పణముచేసిరి.

---

(568–వ పేజీ తరువాయి)

తుంటారు. ఏవేవో ప్రయత్నాలని ప్రార్థనలని యంటుంటారు. ... భర్త యాదరించడు. కనీసం దగ్గరకి వెళ్ళినా చీదరించుకుంటాడు. ... ఆ ప్రకృతి, ఆ పరిసరాలు, ఆ చెలిమిలోని యాంతర్యాలు ఏమైనాయి ... యిదేనా తనకిక శాంతి! యిదేనా తనకిక గమ్యం! ... ఆమె యక్కడ యుండగనే ఆ సతీశుని రెండవ వివాహమునకు ప్రయత్నాలు సాగించారు ... మూడురోజులామె యాయింటిలో యొంటరిగాయుంది ... మూడవనాటి రేయిఅంతా మహా వైభవంగా యింటికి వచ్చారు. నవవధువు యింట యడుగుపెట్టింది ... యింట్లో ఎక్కడా సుభ కనబడలేదు. అంతా వెదికారు. ఎక్కడాలేదు. అత్తగారి చిరాకు సతీశుని కోపం ఎక్కువైంది. కేకలు వేస్తూ పిలిచారు. పెరట్లో ... పండువెన్నెల వెలుగులో, బావిలో ... నిశ్చలమైన నీటిమధ్య ఆమె ప్రశాంత వదనంతో నిర్జీవియై తేలుతున్నది. నలుగురూచేరి ఆమెను పైకి తీసారు. సతీశు డొక్కసారి రెండు చేతులలో ముఖంకప్పుకుని తన గదిలోనికి పరుగెత్తాడు. మంచంపైబడి బోరున ఏడ్చాడు ... బ్రతికుండగా యొక్క కన్నీటి బొట్టుని ఆమెపై చిదపడానికి యిష్టపడని సతీశుడు యిప్పుడు ఆమె స్మృతిని కన్నీటిమయం చేస్తున్నాడు ... పెళ్ళికి పూర్వం, హరిహరుని మాటతో వధువు నిమిత్తం యొక పెద్దవీణ కొనియుంచాడు సతీశుడు ... అప్రయత్నంగా యతని దృష్టి దానిపైబడింది. రేగినగాలి దుమారానికి అది ఎగిరి క్రిందపడిపోయింది. తీగలు ఖంగ్ మని మ్రోగి తెగిపోయినై. వీణ ముక్కలు ముక్కలుగా భగ్నమైంది. శిథిలమైన విపంచి కేసి చూస్తూ యలానే నిశ్చేష్టుడైపోయాడు. తలగడజారి దాని క్రింద సుభ యుంచినలేఖ జారిపడింది.

"ప్రభూ! నన్ను క్షమించండి! నావలన మీరు కష్టాలుపాలవడం నా కిష్టంలేదు ... నేనన్ని విధాల మీకు తగనిదానిని. మీరు పాలకులు నేను పాలితురాలిని. మీరు ప్రభువులు నేను భిక్షువును. కాని వసంతంలో ఎండిన పుష్పం, మధువులేని పుష్పం ... తీగలు తెగినవిపంచి ... భగ్నమైన హృదయం ..." ఆ దేవతామూర్తి లిఖితాక్షరాలు యతని నికృష్టనయనాలకి గోచరితము కాలేదు. కన్నీటి పొరలు యొక్కొక్కటే అతని కళ్ళను కప్పివేసినై.

(టాగూర్ రచన ఆధారంగా.)

# భక్తితత్త్వము

'లక్ష్మి'

శ్రీ రామకృష్ణ పరమహంస చాటినట్లు అన్నిమతములు సత్యసమ్మతములు. అన్ని ఆరాధనలు పరమాత్మ స్వరూపమయిన ఆత్మనారాధించుట. ఆయనను భగవత్సాక్షాత్కారమునకు మార్గమేదని శిష్యులడుగగా భక్తిమార్గము సులభమైనట్టియు, ఫలప్రదమైనట్టిదియని జవాబుచెప్పిరి. భక్తిమార్గము అవ్యాజమైన ప్రేమతో పరమాత్మతో ఐక్యకతనుకోరునది. శ్రీరామకృష్ణపరమహంస యింకా భగవంతుడు యోగులలోను, దివ్యపురుషులలో నేకాక పాపులలోను, హంతకులలోను సయితము స్థావరమేర్పరచుకొనియున్నాడు. కాబట్టి పరమాత్మ సాన్నిధ్యమును కోరువారు ప్రతియొక్క జీవిని ప్రేమించుట కలవాటు పడవలెనని చెప్పిరి. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో అర్జునునకుపదేశించుచు "నన్నుద్దేశించి చేయువారి చేతలద్వారా బంధవిముక్తులయి ఎవరిని ద్వేషించకుండా నాలో ఐక్యమగుదురు" అనిచెప్పెను. జ్ఞానమార్గము రామాఫలం. భక్తి మార్గము సీతాఫలము. సీతాఫలము గుజ్జు యించుమించుగా పైనేలభ్యముకాగలదు. అయితే రామాఫలంతోలు కఠినమై దళసరిగా నుండును.

మహాత్మాగాంధీకి సర్వమానవసౌభ్రాతృత్వము పట్లగల విశ్వాసము దృఢమైనది. ఆయన "నీ విరోధి నీయొక్క తెలివితక్కువ సోదరుడు. అతడు గాయపడినప్పుడుపచర్య చేయుము! అతడు నిన్ను గాయపరచ ప్రయత్నించినపుడు వైతొలగుము!" అని బోధించెను. ఎట్టివిరోధియైనను అగ్నిలాంటి ప్రేమను నిగ్రహించలేదు. గాంధీజీ హింసద్వారాసాధించలేని దేనినైనా ప్రేమ, సహ్రమతలద్వారా సాధించనగునని చాటెను. ఏసుక్రీస్తు "దివ్యజీవితమునకై ఆకలిదప్పులు గలవారు ధన్యులు; ఎందుకనగా వారి నవి నింపేస్తవి. దయాదాక్షిణ్యములు కలవారు పుణ్యాత్ములు; ఎందుకనగా వారు వానికి పాత్రులుకాగలరు. మిమ్ములిట్టు వారిని, నిందించువారిని ఆశీర్వదించండి" అని బోధించిన పలుకులు సువర్ణలిఖితములు.

మనము ప్రతిదినము మనరక్షకులైన మహనీయులు, దివ్యపురుషులు బోధించినట్లు భగవంతునుద్దేశించి "తల్లీ! తండ్రీ! గురూ! ప్రపంచములో దివ్యత్వమున్నది- దుర్మార్గమున్నది - జ్ఞానాజ్ఞానములున్నవి - పరిశుద్ధత, అపరిశుద్ధతలున్నవి. వీటితో మాకేమి సంబంధములేదు. దీనిని నీవు స్వీకరించి మాకు ప్రేమను ప్రసాదించుము; అనగా పవిత్రహృదంతో నిర్మలమైన నీపట్ల అవ్యాజమైన ప్రేమను ప్రసాదించుము" అని ప్రార్థించెదముగాక!

# గృహలక్ష్మి
# సంక్రాంతి సంచిక

గృహలక్ష్మి జనవరి సంచికను సంక్రాంతి సందర్భమున ప్రత్యేక సంచికగా వెలువడ జేయదలచాము.

ఇందులో ప్రముఖుల వ్యాసములు, కథానికలు, నాటికలు, గేయములు, సంక్రాంతి ప్రత్యేకశీర్షికలు, ఆకర్షణ లుండును.

రచయితలు తమ అమూల్యమైన రచనలను డిశంబరు నెలాఖరులోపల విడి విడిగా పుటకు ఒకప్రక్కనే వ్రాసి పంప కోరుచున్నాము.

సంక్రాంతి సంచిక ఆకర్షణీయంగా వెలువడుటకు రచయితలు, పాఠకులు, అభిమానులు సహకరించెదరని ఆశిస్తున్నాము.

సంపాదకుడు

# సుప్రసిద్ధ అమెరికన్ నీగ్రో గాయని మరియన్ ఆండర్సన్

(ముఖచిత్రం)



సుప్రసిద్ధ అమెరికన్ నీగ్రోగాయని మరియన్ ఆండర్సన్ ఈ నెల 11 వ తేదిన మద్రాసు అన్నామలై మందిరంలో పాటకచేరి జరిపింది.

సంగీతకళా రంగంలో పేరు ప్రఖ్యాతులు గాంచిన బహుకొద్దిమందిలాగానే, ఈమెకూడా ఖండాంతర ఖ్యాతి సార్జించుకొన్నది.

ఈ ప్రఖ్యాత గాయని అనేక మంది ప్రెసిడెంటుల నుండి రాజుల వద్ద నుండి బహుమతుల నందుకున్నది. అమెరికాలోను ఇతర దేశాల్లోనూ పన్నెండు విశ్వవిద్యాలయాలు ఈమెకు 'డాక్టర్ అఫ్ మ్యూజిక్' అనే గౌరవ పట్టాన్ని ఇచ్చి గౌరవించాయి. ఇంతకంటే ముఖ్యమైన విషయం జగద్విఖ్యాతి గాంచిన స్వరరచనావేత్తలూ, సంగీత దర్శకులూ, విమర్శకులు, ఈమెను వేనోళ్ళ శ్లాఘించారు. ఈ ఘనత సామాన్యంగా లభించేదికాదు.

అమెరికా విదేశాంగశాఖ అమెరికన్ నేషనల్ థియేటర్ అండ్ అకాడమివారి సంయుక్త ఆధ్వర్యం క్రింద ఈమె ప్రస్తుతం ఆసియాఖండంలో వివిధ దేశాలలో పర్యటిస్తున్నది. మద్రాసు, ఆతర్వాత బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా నగరాలలో పాట కచ్చేరీలు జరుపుతుంది. కచేరి మద్రాసు మ్యూజికల్ అసోసియేషన్ అమెరికా సమాచార శాఖవారి సమిష్టి ఆధ్వర్యాన జరిగింది.

ఈమెను శ్లాఘించే సంగీత ప్రియులు ఇప్పటికే లక్షలాదిగా ఉన్నారు. ఈ పర్యటనతో వీరి సంఖ్య ఇంకా విపరీతంగా పెరిగిపోతుందనటంలో సందేహం లేదు. సియోల్స్న్, సైగాల్, మనీలా, హాంగ్ కాంగ్ నగరాలలో ఈమె కచ్చేరీలు జరిగిన మందిరాలు ప్రేక్షకులతో క్రిక్కిరిసి పోయాయి. బాంకాక్‌లో ఈమె పాటకచ్చేరికి రాజు, రాణి (తల్లి), ప్రధాని పెట్ సరిసిన్ వచ్చారు. రంగూన్‌లో ఈమె కచేరి క్రొత్త ఇంజనీరింగ్ కళాశాల హాలులో ఏర్పాటు చేసి, ఆ హాలంతా నిండిపోగా, రెండువేలమంది ప్రేక్షకులు ప్రక్క ప్రక్కల నిలుచుని వినవలసి వచ్చింది. కచేరి అయిన తర్వాత, ప్రధాని యూనూ స్టేజిమీదకువెళ్ళి ఈ మధుర గాయనిని అభినందించారు.

ఈమె ఫిలడెల్ఫియాలో మామూలు నీగ్రో కుటుంబంలో జన్మించింది. ఈమెకు ఇద్దరు సోదరీమణులున్నారు. చిన్నప్పుడే ఈమెలో అమోఘమైన గానకళావైదుష్య లక్షణాలు పొడగట్టినవి. చర్చిలో గోష్ఠి గానంలోనూ, ఎవరైనా 'సోప్రానో' 'ఖాస్' లో పాడే గాయని రాలేక పోయినప్పుడు, అమెకు బదులుగాను పాడుతుండేది. చర్చి సమావేశంలో ప్రోగయిన ద్రవ్యంతో ఈమె సంగీతాన్ని నేర్చుకోడానికి ప్రారంభించింది. ముస్ముందు గొప్పగాయనిగా పైకి వచ్చే సూచనలు ఈమెలో కనిపించి ఉపాధ్యాయులు ఉపకారవేతనాలు ఇచ్చి సంగీతం నేర్పించేవారు. ఈమె అభిమానులు ఒక నిధిని వసూలుచేసి ప్రఖ్యాత గాత్ర సంగీతోపాధ్యాయుడు గ్యూసెప్పె బోఘెట్టి దగ్గర ఈమెకు సంగీతం నేర్పించారు. 1926వ సంవత్సరంలో జరిగిన సంగీతం పోటీలలో పాల్గొనేటందుకు తగిన అర్హత పొందగలిగేటట్లు ఈయన శిక్షణ ఇచ్చారు. ఈ పోటీలో 300 మంది పాల్గొన్నారు. న్యూయార్క్ ఫిలహార్మొనిక్స్ వాద్య బృందంతో పాడి బహుమానం సంపాదించింది. తత్ఫలితంగా ఈమెను ఫిలడెల్ఫియా వాద్య బృందంవారు ఈమెకు ఉద్యోగం ఇచ్చారు.

తర్వాత నాలుగు సంవత్సరాలలో మరియన్ ఆండర్సన్ కార్నెగీహాలులో పాటకచ్చేరిచేసి స్కాలర్‌షిప్ పొందింది. అనంతరం ఈమె 1930లో బెర్లింగ్‌టన్‌లో మొట్టమొదటి పాటకచేరి నిచ్చింది. స్కాండినేవియాకూడ సందర్శించి వచ్చింది.

1933 వచ్చింది. మూడు నెలలపాటు యూరోపులో పర్యటించి వద్దామని మరియన్ అండర్సన్ బయలుదేరింది. కాని 1935 సంవత్సరం చివరివరకూ పర్యటిస్తూనే ఉంది. ఈ రెండేళ్ల పర్యటనం సాల్జ్‌బర్గ్‌లోని మొజార్టియమ్‌లో పూర్తి అయింది. ఇక్కడే అరుట్రోటస్కానిని ఈమెను కలుసుకుని "ఇంత కమ్మని గాత్రాన్ని నూటికి కోటికి ఎప్పుడో ఒకసారి మాత్రమే వినబడుతుంది" అని అన్నారు అయన.

దిగ్విజయ కళాయాత్ర చేసి అమెరికా తిరిగివచ్చిన తర్వాత ఈమె న్యూయార్క్ టౌనుహాలులో పాటకచేరి చేసింది. అప్పటినుంచి ఆమె పేరు ప్రఖ్యాతులు దిన దిన ప్రవర్ధమానవవుతూ వచ్చాయి. 20 సంవత్సరాల తర్వాత మెట్రోపాలిటన్ ఓపేరా హౌస్‌లో జరిగిన పాటకచేరీలో ఆమె గానకళా వైదుష్యం ఉన్నతోన్నత శిఖరాన్ని అందుకుంది.

ఈ కోయిల గాత్రి దీర్ఘ జీవితంలో లెక్కలేనన్ని గౌరవాలు సత్కారాలూ జరిగాయి. వాషింగ్టన్‌లో లింకన్ స్మారక మందిరం సోపానాల మీద పాడవలసిందిగా 1939 లో అమెరికా ప్రభుత్వం ఆహ్వానించింది. ఈ బహిరంగ గానకళా ప్రదర్శనానికి 75,000 మందికి పైగా ప్రేక్షకులు వచ్చారు. ఈమె జీవితంలో చిరస్మరణీయమైన విశేషంగా నాటి పాటకచేరి నిలిచిపోయింది.

"గౌరవ ప్రదమైన ఏ రంగంలోనైనా కృషిచేసి విజయాన్ని సాధించిన" అమెరికన్ నీగ్రోకు ప్రతి సంవత్సరం బహూకరించే "స్పింగర్న్ పతకం" ఆ సంవత్సరమే ఈమెకు దక్కింది. ఫిలడెల్ఫియాలో పౌరులలో ప్రముఖుల కివ్వబడే బెక్ పతకం 1949లో ఈమెకు ఇచ్చారు. దీనితో కలిపి బహూకరింపబడిన 10,000 డాలర్లు, సంగీత కళలో ఆసక్తులైన యువ గాయనీ గాయకుల ఉపయోగార్థం "మరియన్ అండర్సన్ అవార్డు"ను ఆమె స్థాపించింది. వైట్‌హౌస్‌లో అమెరికన్ ప్రెసిడెంట్ల సమక్షంలో మూడు పర్యాయాలు పాటకచేరి చేసింది. ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ రెండవసారి ఆ పదవికి ఎన్నుకోనబడినప్పుడు అమెరికన్ జాతీయగీతాన్ని ఈమెచేతకూడా పాడించారు.

స్వదేశంలోని గౌరవపట్ట ప్రదానాలతోపాటు, విదేశాలలోకూడా అనేక ఉన్నత సమ్మానాలను అండర్సన్ అందుకున్నది. వాటిలోకొన్ని లైబీరియా నుంచి అత్యున్నతమైన అవార్డు-"ఆర్డర్ ఆఫ్ ఆఫ్రికన్ రిడంప్షన్," స్వీడన్‌నుంచి "లిటరిస్ ఎట్ ఆర్టిబస్" పతకం; ఫిన్లాండు నుంచి "ఆర్డర్ ఆఫ్ ది వైట్ రోజ్ —మానర్‌హీమ్" పతకం; జపాను నుంచి "యుకెన్షె పతకం;" ఇవిగాక ఫ్రాన్స్, హైటీ, ఫిలిప్పీన్ల నుంచికూడా పొందినవి ఉన్నాయి.



69 వ జన్మదినోత్సవమును యీ నెల జరుపుకొనిన భారత ప్రధానమంత్రి పండిత నెహ్రూ

అత్యున్నతమైన విజయాన్ని సాధించిన మరియన్ ఆండర్‌సన్ మామూలు జీవితంలో చాలా నిరాడంబరంగా గడుపుతుంది. వంటకాలు తయారుచేయడం కుట్టుపని, తోటపని వంటివి ఆమె స్వయంగా చేస్తూంటుంది.

స్వగృహానికి "మరియన్న"అనే పేరుపెట్టుకొంది. కనక్టికట్‌లో డాన్బరీ సమీపంలోగల 105 ఎకరాల క్షేత్రంలో భర్త ఓరూఫస్ ఫిషర్ (వాస్తు నిపుణుడు)తో గృహలక్ష్మివలె కాపురం చేస్తూంటుంది.




**మానసబోధామృతం :** కర్త : శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవిగారు ; క్రౌనుసైజున దాదాపు 50 పేజీలు ; ఏ. వి. కృష్ణమూర్తి ; ఫోర్మేన్, పి. డబ్ల్యు, వర్కుషాపు, ధవళేశ్వరం, తూర్పుగోదావరిజిల్లా - అనే చిరునామాకువ్రాస్తే, ఈ గ్రంథం వుచితంగా లభిస్తుంది.

ఇది 217 మత్తేభాలుగల శతకద్వయం అనవచ్చు ; లేదా, 'ద్విశతి' అనికూడా చెప్పొచ్చు. అయితే శతకపద్యాంతాల్లోవచ్చే మకుటం. ఇందులో పద్యాది సంబుద్ధిగా రూపొందింది. 'మనమా' అనే పదంతో ప్రతి పద్యారంభం. – ఈ క్రమానుసరణంవల్ల అన్ని పద్యాలూ మత్తేభాలుగా – తత్రాపి – నకారప్రాస సంకలితాలుగా కవిత్వం సాగించవలసిన నిర్బంధాన్ని కవి కొనితెచ్చుకొన్నట్లు అయింది.

కవనం ఆపాతమధురం, ధారాశుద్ధి సంయుతం, ఉచిత శబ్దాలంకృత, విషయాలు, వైరాగ్యం, నివృత్తిమార్గం, మోక్షసాధనం, నైతికప్రవర్తనం మొదలయిన వాటినిగూర్చి ప్రబోధించే ధోరణిలో, లలితంగా సాగిపోతూ వుంటుంది. వేదాంత విషయ బాహుళ్యంగల యిట్టి గ్రంథాలు నాస్తికత్వం వ్యాపిస్తూ వుండే నేటి భారత దేశానికి పారమార్థికాన్ని, ఆధ్యాత్మిక చింతను గాఢంగా చేకూర్చగలదు ; తత్వ జిజ్ఞాసువులందరూ తప్పక చదవతగిన గ్రంథం ఇది.

'కౌశిక'

**భాగవతకథ (5-వ భాగము) :** శ్రీ 105 ప్రభుదత్త బ్రహ్మచారిగారు. అనువాదం : శ్రీరామశరణ్ కుందుర్తి వేంకట నరసయ్యగారు. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి, వెల రు. 2-0-0.

ఇందులో 'పరీక్షితునకు శాపము' కథతో ప్రారంభమయి 'భగవంతుని ద్వితీయ పరంపరోపక్రమము'తో పూర్తియగు 19 భాగవత కథలున్నవి. అనువాదము సరళమైన శైలిలోనుండి భాగవత మూల గ్రంథమందలి వివిధాంశములను రసవంతంగా సామాన్యులకు సయితం అర్థమయ్యేలాగున్నది. ఇది అమూల్య గ్రంథము.

**మనలో - మనమాట :** శ్రీమతి కే. లక్ష్మీరఘురాం. ప్రచురణకర్తలు : ఆంధ్రమహిళాసభ, మైలాపూరు, మద్రాసు 4. వెల రు. 1/-

ఈ పుస్తకము మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించుటకని, మంచి చెడ్డలను, విచక్షణా జ్ఞానముతో పెంపొందించుటకని మహిళాలోకం సమరస సమైక్యతలతో నిష్కాపట్యంగా సరదాగా కాలక్షేపంచేయుటను ప్రోత్సహించుటకని ఉద్దేశించబడినది. రచయిత్రి అనుభవ విశేషాలు మహిళా లోకాన్ని పురోగమింపచేయగలవనియు, ఆమె ఆశయలక్ష్యాలను పాఠకులు గుర్తించి స్వీయ సౌభాగ్యమును తీర్చిదిద్దుకొగలదనియు ఆశిస్తున్నాము.

# సంపాదకీయములు

## దేవాలయాలలో స్త్రీల నృత్యము

మద్రాసు రాష్ట్రంలోని దేవాలయాలలో స్త్రీలు నృత్యము చేయుటను నిషేధించుచు నొక చట్టము అమలులోనున్నది. పురుషులు దేవాలయములలో నృత్యముచేయుటను నిషేధించని యీ చట్టము స్త్రీలను మాత్రము ఎందుకుద్దేశించి చేయబడినదో యూహాతీతము.

ఏకళ యుద్దేశమయినా మానవునిలో ఆనందోత్సాహములను పూరిస్తూ సుఖప్రదమైన, ఆదర్శనీయమైన జీవితమును రూపొందించడమే. ఈ ఉద్దేశము ఏ ఒక్క పురుషులవలననో, లేక స్త్రీలవల్లననో నెరవేరాలనే నియమములేదు. కళాపిపాసకుగాని, కళారాధనకుగాని స్త్రీ పురుషులనే విచక్షణపాటింపు అనవసరము.

తనలోని కళాపిపాసను సుఖసంతోషాల సిద్ధికి వినియోగించుకొని, తన ఆత్మానందమును స్వీయ శ్రేయోపురోభివృద్ధులకేకాక విశాల హృదయంతో ప్రపంచ కళ్యాణమునకు సయితం వినియోగపరచినచో మానవజీవితము స్వర్గతుల్యము కాగలదు. కళాపిపాస, కళారాధనలు సమకూర్చే ఆనందోత్సాహములు మానవుని ఉద్రేకపరచి తప్పుడు మార్గాలలో నడిపేటట్లయినచో నది దేవాలయములలోనే సంభవమను కొనుట పొరబాటు. పవిత్రత, భక్తి విశ్వాసములకు నిలయములైన దేవాలయములు మానవులలో భయ భక్తులు కల్పించి అట్టి ఒడిదుడుకులను నివారించును.

నృత్యము, సంగీతము, చిత్రలేఖనములాంటి కళలు పురుషులచేకంటె, స్త్రీలచే అమోఘంగా రాణించునవి. భక్తిపారవశ్యంతో ముక్తిసాధనకు సంగీతము, నృత్యము ఆనాడు, యీనాడు అనే విచక్షణ లేకుండా వినియోగపడుచుండునవి. ప్రాచీనకళా ప్రాభవమునకు నిదర్శనములైన దేవాలయములు యీనాడు సయితం విద్యావిజ్ఞాన నిలయములుగాను, కళాకేంద్రములుగాను విలసిల్లవలసిన అవసరం ఎంతైనా యున్నది. విద్యావిజ్ఞానములతోబాటు సంగీతము, నృత్యము, చిత్రలేఖనములాంటి కళలు సామాన్య ప్రజలకు అందుబాటులోకి రావాలంటే దేవాలయాలు వానికి స్థావరములుఅయి ప్రజలయొక్క, ప్రభుత్వముయొక్క ఆదరాభిమానములకు, ప్రోత్సాహమునకు పాత్రము కావలసియున్నది.

స్త్రీలు దేవాలయములలో నృత్యముచేయుట గౌరవలోపమేమికాదు. సాధారణ రంగస్థలముకంటె దేవాలయములు కళాప్రదర్శనానికి ఏవిధంగాచూచినా మెరుగేకాగలవు. భగవత్సాక్షాత్కారమునకవసరమయిన తన్మయత్వాన్ని సమకూర్చగల నృత్యములాంటి కళాప్రదర్శనము ముక్తి సాధనకు సయితము విశేషముగా నుపకరించగలదు.

## శ్రీ హేవళంబినామ సం॥ర కార్తిక, మార్గసిర మాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ నవంబరు నెల | 16 | శ | న 10-0 పూఫ 46-18 |
| | 17 | ఆ | ద 3-39 ఏవ్యం 53-34 ఉఫ 41-39 |
| | 18 | సో | ద్వా 51-4 హ 37-13 త్యా 3-44 |
| | 19 | మం | త్ర 45-28 చి 33-13 |
| | 20 | బు | చతు 40-39 స్వా 29-56 |
| | 21 | గు | ● అమా 36-47 విశా 27-34 |
| | | | **మార్గసిరమాసము** |
| | 22 | శు | శుపా 34-3 అనూ 26-15 |
| | 23 | శ | వి 32-33 జ్యే 26-9 |
| | 24 | ఆ | త 32-18 మూ 27-16 |
| | 25 | సో | చ 33-17 పూషా 29-33 |
| | 26 | మం | పం 35-36 ఉషా 32-59 |
| | 27 | బు | ష 38-34 శ్ర 37-23 |
| | 28 | గు | స 42-32 ధ 42-31 త్యాజ్యాభావః |
| | 29 | శు | అ 47-5 శత 48-15 |
| | 30 | శ | న 51-55 పూభా 54-14 |
| 1957 సం॥ డిశంబరు నెల | 1 | ఆ | ద 56-47 ఉభా 60-10 |
| | 2 | సో | ఏ 60-10 ఉభా 0-12 |
| | 3 | మం | ఏ 1-16 రే 5-53 త్యాజ్యాభావః |
| | 4 | బు | ద్వా 5-16 అశ్వ 11-2 త్యా 4-20 |
| | 5 | గు | త్ర 8-28 భ 15-23 |
| | 6 | శు | చతు 10-39 కృ 18-46 |
| | 7 | శ | ○ పౌ 11-42 రో 21-3 త్యా 4-10 దత్తాత్రేయజయంతి |
| | 8 | ఆ | కృపా 11-27 మృ 22-7 బలరామజయంతి |
| | 9 | సో | వి 10-4 ఆర్ద్ర 21-57 త్యా 3-55 |
| | 10 | మం | త 7-24 పున 20-36 త్యా 3-51 |
| | 11 | బు | చ 3-37 ఏవ్యం 55-29 పుష్య 18-12 |
| | 12 | గు | ష 53-27 ఆశ్రే 14-53 |
| | 13 | శు | స 47-18 మ 10-54 |
| | 14 | శ | అ 40-56 పూఫ 6-29 కాలభైరవాష్టమి |
| | 15 | ఆ | న 34-36 ఉఫ 1-55 గొబ్బిపూజా ధనుర్మాసారంభః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# శ్రీ సాయిబాబా మహాసమాధి దినోత్సవ దృశ్యములు



స్వామి కేశవయ్యాజీ దివ్యసందేశమును
పూరిస్తున్న దృశ్యము



ఉత్సవములో పాల్గొనిన భక్తకోటిలో కొంత భాగము



స్వామి కేశవయ్యాజీ ఉత్సవసమావేశమునకుముందు భక్తులతో
ముచ్చటిస్తున్న దృశ్యము

Lodhra Press, Madras-14.